# పతిత జీవులు

[ నాటకం ]



మాలం

గోర్కీ

అనుకృతి:

శ్రీనివాస చక్రవర్తి



సాహిత్రీ పబ్లికేషన్స్

బకింగ్‌హాంపేట : : విజయవాడ

# పాత్రలు

*

| | | | వయస్సు |
|---|---|---|---|
| 1. | కొండయ్య : | అద్దెకొంప యజమాని | 54 |
| 2. | కమల : | అతని భార్య | 26 |
| 3. | విమల : | కమల చెల్లెలు | 20 |
| 4. | పోలయ్య : | పోలీసు జవాను | 50 |
| 5. | గోపాలం : | కమల ప్రియుడు | 28 |
| 6. | గంగులు : | తాళాలబత్తుడు | 40 |
| 7. | పార్వతి : | వాని భార్య | 30 |
| 8. | రాధ : | అనాధ | 24 |
| 9. | సుబ్బి : | పలహారాలమ్మేది | 40 |
| 10. | భీమన్న : | టోపీలు కుట్టేవాడు | 45 |
| 11. | సత్యం } | | 40 |
| 12. | యాక్టర్ } | | |
| 13. | రాజా : | | 33 |
| 14. | దాసు : | యాత్రీకుడు | 60 |
| 15. | ముత్తాయ్ : | తాగుబోతు | 20 |
| 16. | జోగాయ్ : | | |
| 17. | సాహెబ్ : | | |

ఇంకా జనం, ఇతరులు

# ఒకటో అంకం

[గుహలాంటి అద్దెకొంప. గోడలనిండా బూజు. పొగచూరిపోయున్నాయ్. సున్నం బెత్తెలు బెత్తెలుగా వూడిపోయింది. కుడివైపు గోడకు ఎత్తుగావున్న చదరపు కిటికీనుంచి వెల్తురు పడుతూంటుంది. కుడివైపు గోపాలం గది. తలుపుదగ్గర భీమన్నతిన్నె, ఎడమవైపుచివర నెగడు. ఎడమవైపు తలుపు. తలుపు తెరిస్తే వంటిల్లు. ఇందులో సుబ్బి, రాజా, రాధల కాపరం. నెగడుకూ యీ తలుపుకూ మధ్య వెడల్పాటి పక్క, గోడల పొడుగునా తిన్నెలు. ఎడమవైపు రంగస్థలం చివర ఒక దుంగ. దానికి తగిలించి యినపదాగలి, పటకారు. గంగులు యింకో చిన్న దుంగమీద కూర్చుని పాత తాళానికి చెవి సరిచూస్తుంటాడు. చుట్టూ పాతతాళాలు, వాటిని బాగుచేసే సామాగ్రి సుత్తీ వగైరా. వాలుమధ్య విరిగిపోయి రంగుమాసిన బల్ల. కుర్చీలు, ఒక మూలపొయ్యి దగ్గర సుబ్బి పప్పులు వండుతూ, రాజా ఫలహారం చేస్తుంటాడు. రాధ బల్లమీద మోచేతులు ఆనించి ఒక తుక్కు నవల చదువుతూంటుంది. పక్కమీద దగ్గుతూ పార్వతి. భీమన్న తిన్నెమీద కూర్చుని పాతటోపీ పరిశీలిస్తుంటాడు. చుట్టూ అట్టలు, గుడ్డపీలికలు, కత్తెర, దారం వగైరా. అప్పుడే మేల్కొన్న సత్యం గొణుగుతుంటాడు. యాక్టరు దగ్గుతూ పచార్లు చేస్తుంటాడు.

రాజా : ఊఁ—ఆ తరవాత ?

సుబ్బి : ఆ తరవాత – 'వొద్దుబాబూ, వొద్దువొద్దూ' అని సెప్పేశా. యసంటావుండూ... ఆసంబడమూ తెలిసొచ్చింది. యికవేచిన రొయ్యలువొంద వొలెట్టినా మల్లీనను పీట్లకాడికి యీడ్సుకు పోలేవు. అని తేల్చిసెప్పేశా.

భీమన్న : (సత్యంతో) యేయ్, యేంటాగొనుగుడు ?

(సత్యం తిరిగే గొణుకుతాడు)

సుబ్బి : నేనూ, సొంతతురాల్ని. నాకు నేనే కామందుని. నేను వో మొగోడికి బానిచనై పడుంటానా?–. పాణం బోయినాసడేగానీ – ఊహుఁ– అడిసిసచ్చినాసడే. ఆడు మారాజైనాసడే–ఊహుఁ.

గంగులు : అబద్దం !

సుబ్బి : యేంటీ ?

గంగులు : నువు సెప్పేదంతా అబద్దం. నువు పోలీసు పోలయ్యగాణ్ణి కట్టుకు తీరతావ్...

రాజా : (రాధ చదివే పుస్తకం లాక్కొని శీర్షిక చదువుతూ) "ప్రళయ ప్రేమ" (నవ్వు)

రాధ : (పుస్తకం అందుకోబోతూ)యిదిగో, యిలాయిచ్చేసెయ్... యిచ్చేసెయ్... యేంటా వేళాకోళాలు, మహా...

(రాజా పుస్తకం గాలిలో ఆడిస్తూ ఆమెను వేధిస్తాడు)

సుబ్బి : (గంగులుతో) తుప్పతల ముసిలి ముండాకొడకా! నే సెప్పేదంతా అబద్దమట్రా ? ఇలా నన్నవమానిత్తానికి నీకెన్ని గుండెలున్నయిరా !

రాజా : (పుస్తకముతో రాధ తలమీదకొట్టి) నువ్వొత్తి తెలివితక్కువా దద్దమ్మవే రాధా ?

రాధ : (పుస్తకం లాక్కుంటూ) యిచ్చేసెయ్...

గంగులు : బలేబేసయినాయివి. అయితేనేం నువా పోలయ్యా గాణ్ణి కట్టుకుతీరతావ్... అందుకే కాచుకూకుంటివిగా!...

సుబ్బి : ఔనునిజం. నే కట్టుకునేదేనిజం... యేం జేత్తాయేం... నీ పెల్లాంపాణం సేతులారా యిలాపింమతూంటే...

గంగులు : ఛీ, నోర్మూయ్, గుడిసేటిలంజా! నీ కెం దు కేం ఆగోడవ...

సుబ్బి : ఒహో ! నిజంసెబితే నిట్టూరం !

రాజా : అదుగో, వెడుతున్నారు. రాధా !

రాధ : (తలెత్తకుండానే) పోవెళ్ళిపో.

పార్వతి : తెల్లారింది... గోలేంయకండి... కొట్టాడుకోకండి... వొట్టు...

గంగులు : మల్లీ మొదలెట్టా గొనుగుడు !

పార్వతి : రోజూ వొళ్ళేపాడుగోల ! ఆయిగా సావనన్నా సావనీయరాయేం ?

భీమన్న : ఈ కూత్తగోలకి దడిసిసావు పారిపోద్దేం ?

సుబ్బి : (పార్వతిగగ్గరకు వెళ్ళి) ఈరావణాసుడితో యెలాకాపరం యెలిగిత్తున్నావే యమ్మా ?

పార్వతి : నన్నొక్కతనీ యిలాసావనీ... పో-యెల్లిపో...

సుబ్బి : హుం-యిదంతా నీసావుకొచ్చింది... ఎదుర్రొమ్ముల్లో యియ్యాలేమన్నా తేలిగ్గావున్నా ?

రాజా : ఫుట్బ్యాల్! బజారెళ్ళే వేళైంది.

సుబ్బి : నడే-పద (పార్వతితో) యేడేడిపప్పులుతినాలనిలేదంటే?

పార్వతి : ఊహుఁ... తిండి! తిండికేంలే, యెదవతిండి!

సుబ్బి : అయినాతిన్నాడు. యేడేడి పప్పుల్తింటే దగ్గుకొంచెం తగ్గుతుద్ది. ఈ సిప్పలో పెడుతుండా. తినాలనిపించినపుడు తిను. రా, రాజా, నారాజా! (గంగులి) హుఁ-వొస్తేదరిద్ర గొట్టుమొగమోడ!

(వంటింటోకి వెడుతుంది)

పార్వతి : (దగ్గుతూ) అమ్మో!

రాజా : (దొంగతనంగా రాధతల ముందుకుతోసి) ఇక కట్టేయ్... పిచ్చికూనా!

రాధ : (గొణుగుతూ) పో-వెళ్ళిపో...మీకు నేనేం అడ్డొస్తున్నా!

(రాజా ఈలవేసుకుంటూ సుబ్బి వెనక వెడతాడు)

సత్యం : (పక్కమీదనించి లేస్తూ) రాత్రి నన్నెవరూ కొట్టింది?

భీమన్న : యెవడైతేనేం ?...

సత్యం : యెవడైతేనేంగానీ, నన్నెందుకూ కొడతా ?

భీమన్న : పేకాటలో వున్నా ?

సత్యం : ఆఁ—

భీమన్న : అందుకే నిను కొడత...

సత్యం : దొంగముండాకొడుకులు !

యాక్టర్ : యెపుడో మంచిరోజుచూసి చచ్చేదాకా తంతార్లే!

సత్యం : వొస్తే తెలివితక్కువ వెధవ్వి!

యాక్టర్ : యేం ?

సత్యం : మనిషిని రెండుసార్లు చంపగలవేం ?

డ్యాక్టర్ : యెందుకనేం ?... యెందుకో అర్థంకావడంలే...

గంగులు : (డ్యాక్టరుతో) యిలా వొచ్చి తిన్నంగా కూకో...

డ్యాక్టర్ : నీకెందుకోయ్ నాగోడవ ?...

గంగులు : అలానేఁ కమలమ్మని రానియ్... యెవడి గోడవో తేల్చే త్తది లే.

డ్యాక్టర్ : దాని పిండం పెట్టిరి ! ఇవాళ ఊడవడం రాజా వంతు... రాజా !

రాజా : (వంటింటోంచివస్తూ) వూడవటానికి నాకేం తీరికలేదుం సుబ్బామ్మతో బజారెడుతున్నా.

డ్యాక్టర్ : గంగలో దిగు నాకేం...వూడిచే వంతు నీదీ... వొకళ్ళని కూర్చోబెట్టి వాళ్ళ పని చేసిపెట్టానికి యిక్కడ నేనేం కూర్చోలా.

రాజా : ఓరి ! నీదుంపతెగ ! పోనీ – రాధ ఊడుస్తుందిలే... యేయ్, ప్రళయ ప్రేమా ! లే – లే.

(పుస్తకం లాక్కుంటాడు)

రాధ : (లేస్తూ) యేంకావాలేం ? యిలా ఇచ్చెయ్. యేవిటా వేళాకోళాలు! మహా–బలే పెద్దమనిషి వే.

రాజా : (పుస్తకం తిరిగిచ్చివేస్తూ) మహా మంచిమనిషివికదూ, రాధా ! కాస్త యివాళిటికి నాబదులు వూడుద్దూ–పున్నెముంటుంది.

రాధ : (వంటింటిలోకి వెడురూ) ఓ–తప్పకుండా – సరేనా...

సుబ్బి : (వంటింటి గుమ్మందగ్గర రాజాతో) రా, రా. నీ సాయం లేకుండానే యిక్కడ నీపనంతా సేసుకుపోతాల్లే... యేయ్

యాకటక్! నిన్నే అడిగేది ... కొత్త దయించి... నీ నడుమేం యిరిగిపోదులే...

డాక్టర్: హూ॥ యెప్పుడూ నన్నే... యెందుకో?

రాజా: (కావిడి బుజాన వేసుకుని ప్రవేశం. కావిట్లో గుడ్డలుకప్పిన కుండలు) రోజూకంటె బరువుగావుందే...

సత్యం: రాజాల యిళ్ళల్లో పుట్టటం అదృష్టమేనంటా?

సుబ్బి: (డాక్టరుతో) యిక వూడవడం మొదలెట్టు.

(ముందు రాజా తర్వాత సుబ్బి నిష్క్ర)

డాక్టర్: దుమ్మూగ్గట్రా పీలిస్తే నాకు జబ్బుజేస్తుంది. (గర్వంతో) నా దేహం సారాతో విషమైపోయింది....

(పక్కమీదకువాలి ఆలోచనలో పడతాడు.)

సత్యం: దేహం... దేహం...

పార్వతి: మామా!

గంగులు: యేం కావాలేం?

పార్వతి: సుబ్బామ్మ నాకోసం పప్పులుపెట్టెల్లింది. తీసుకుతిను.

గంగులు: యేం, నీ కక్కర్లే?

పార్వతి: అక్కర్లా... నే నెందుకూ తినడం! కష్టపడేవాడివి నువ్వూ... నీకొకావాలి.

గంగులు: భయమేస్తోందా? భయపడబోకు... సెప్పలేం... బవుశా...

పార్వతి: పోయి తిను. నావంటో యేం బావుండలా... దగ్గర కొచ్చేసిందనుకుంటా...

గంగులు: (బయటికి వెడుతూ) దిగులెట్టుకోకేం... నిమ్మలించొచ్చు. వొకప్పుడు యిట్టే నిమ్మలిం చూరుకుంటుంది. (వంటింటోకి వెడతాడు)

యాక్టర్ : (హఠాత్తుగా మేల్కొన్నవానిలా బిగ్గరగా) నిన్న ఆస్పత్రిలో డాక్టరు చెప్పాడు : "నీదేహం సారాతో పూర్తిగా విషమైపోయిందీ" అని...

సత్యం : (నవ్వుతూ) ద్రేహం...

యాక్టర్ : (హఠంచేస్తూ) ద్రేహంకాదు. దేహం.

సత్యం : ఒక్కాలో !

యాక్టర్ : (చేత్తో జపుతూ) తెలివితక్కువ మొద్దా! ఊరికే వేళాకోళానికి అంటున్నాననుకున్నా? దేహం విషమయమైపోతే... వూడిస్తే జబ్బుచేస్తుంది... దుమ్మొపిల్చడం...

సత్యం : క్రిములు... హాహాహ !

భీమన్న : యేంటీ గొనుగుతున్నా ?

సత్యం : మాటలు... మరి... నీరంధ్రభ్రమజాల...

భీమన్న : అంటే, యేంది ?

సత్యం : తెలీదు... మర్చిబోయా.

భీమన్న : మర్చిబోతే మరెందుకా వాగుడు ?

సత్యం : వుత్తుత్తనే, నవ్వుతాలకి... మనుషులు మాటాడేమాటలంటే నాకు విసిగెత్తిపోయింది, భాయీ ... విసిగెత్తిపోయింది ... ఆమాటలే ... ఆమాటలే వినీ వినీ చెవులు చిల్లులడిపోతున్నాయ్.

యాక్టర్ : అందుకే "ఎందుకీ మాటలు" అన్నాడు హరిశ్చంద్ర నాటకంలో బలిజేపల్లి కవి. ఆ నాటకం - బలే బాగుంటుందిలే. అందులో మనం హరిశ్చంద్రుడి వేషం వేసేవాళ్ళం... హరిశ్చంద్రుడి వేషం.

గంగులు : (వంటింటోంచి వస్తూ) మరి తోటీవేషం యెప్పుడేత్తా ?

డాక్టర్ : నీగోడవేమిటో నువుపడక - యిదంతా నీకెందుకు?
(గుండెలు బాదుకుంటూ) హా ! ప్రేయసీ !

"ఏనాడు నడచినా వీ ఎడారులలోన
సలలితారామ సీమలనెగాని"

(దూరాన అరుపులు, ఏడ్పులు, పోలీసు యీలలు విన్పిస్తాయ్. గంగులు కూర్చుని ఆతురాయితో గరగరావప్పుడుచేస్తూ తాళించెవి అరగదీస్తుంటాడు.)

సత్యం : నాకు విచిత్రమైన పదాలన్నా, ఎవరికీ అర్థంకాని పదాలన్నా మహాయిష్టం... టెలిగ్రాపు ఆఫీసులో పని చేస్తుండగా చాలా పుస్తకాలు చదివా.

భీమన్న : నువు టెలిగ్రాపులు గొట్టే ఆడివికూడానా ?

సత్యం : ఔను...కొన్నిమంచిపుస్తకాలున్నాయ్...చిత్రమైన పదాలు చాలా వున్నాయ్. నేను చాలా చదువుకున్న వాణ్ణి... తెలుసా...

భీమన్న : ఆఁ...ఆముక్క లచ్చచార్లు యిన్నా...యెంత సదువుకున్నాడివైతేనేం...మరి యిపుడు...సాలా భేధం వుంది, భాయీ...నా సంగతి సూడు...వొకప్పుడు నేను కలంకారీ పనిచేసేవోణ్ణి. సొంత దుకాణమూ వుండేది. గొత్తబొచ్చుకు రంగులేయటంతో మోచేతుల్దాకా పచ్చడి పోయింది. సచ్చేదాకా అలానే వుంటుందనీ, పచ్చటి సేతుల్తో సచ్చిపోతాననీ అనుకునేవాణ్ణి... యిక యిపుడు వాటొంకసూడు... మురిగ్గా వున్నాయంతే... హుం...

సత్యం : అయితే యేమంటా ?

భీమన్న : యేంలేదు, అంతే.

సత్యం : యింతకీ నీ ఉపన్యాసంలో అసలు సంగతేవిటి ?

భీమన్న : మరెంలా. యేదో మనసులో మాట. పైన యెంత రంగు పూతపూసినా, చివరికంతా తుడిచిపెట్టుకుపోద్ది... హుం...

సత్యం : నాయెముకలు కొరుక్కుపోతున్నయ్.

యాక్టర్ : (మోకాళ్ళకు చేతులు చుట్టుకొని కూర్చుని) చదువులో యేముందోయ్. కావలసింది తెలివి. నేనోయాక్టర్నెరుగున్నా. వాడు తనపార్టు అక్షరం అక్షరంకూడ బలుక్కుంటూ వల్లేసేవాడు. అయితేనేం యాక్టుచేస్తుంటే చూచేవాళ్ళ ఆనందంతో హాలంతో ఊగి హోరెత్తిపోయేది.

సత్యం : భీమన్నా ! అయిదణాలు బదులిస్తూ.

భీమన్న : నాదగ్గిర రెండణాలేవున్నయ్.

యాక్టర్ : యాక్టరివికావాలంటే తెలివితేటలుకావాలి, తెలివితేటలంటే నీలో, నీశక్తిలో నమ్మకం.

సత్యం : అయిదణాలు బదులియి, నువ్వుమహాతెలివిగలాడవనీ, మహావీరుడవనీ, పోలీసుఆఫీసరువనీ నమ్ముతా... గంగులూ! నువ్వన్నా అయిదణాలు బదులిద్దూ.

గంగులు : పోరా, యెదవా, పో, చుట్టూనీలాటి ముష్టిమూక సాలావుంది.

సత్యం : దేనికాతిట్లు ? నీదగ్గర వో చిల్లకానైనా లేదని నాకు తెలీదూ ?

పార్వతి : (గంగుల్తో) వూపిరాట్టంలేదు. వుక్కగావుంది.

గంగులు : నేనేం జేసేదీ?

భీమన్న : బైటితలుపుతియ్.

గంగులు : ఆ—అలానే. నువ్వొకడతిన్నామీాదా, నేనికడ నేల మీాదా... చోట్లుమార్చుకుందాం. అపుడు తలుపు తీయొచ్చు, నాకుజలుబుజేసింది.

భీమన్న : (నెమ్మదిగా) తలుపుతియమనికోరింది నేనేంకాదు... నీపెల్లాం...

గంగులు : (చిరచిరలాడుతూ) కోరికలకేం...కోరికలుకావలసినన్నీ.

సత్యం : నాతలెంత దిమ్మెక్కిపోయిందనుకున్నా... మనుషులు తిండిగింజలకోసం వొకళ్ళ నొకళ్ళు యెందుకూ తన్నుకోవడం ?

భీమన్న : వొక్క గింజలకోసం కాదు, పొట్టకోసంకూడా. (తీస్తూ)బియ్యం కొనుక్కు తెచ్చుకుంటా. మనింటికామందూ, ఆడిపెల్లాం ఇంకా వేంచేయలేదేం సెప్మా? ... కొంపదీసి బాల్చీ తన్నెయ్‌లేదుగందా ?(వెళ్ళిపోతాడు)

(పార్వతి దగ్గుతుంది. తలకింద చేతులుపెట్టుకుని సత్యం కదలకుండా పడుకుంటాడు)

డాక్టర్ : (విచారంగా పార్వతిదగ్గిరికి వెళ్ళి) వొంట్లో బాగుండ లేదా యేం ?

పార్వతి : వుక్కగావుంది.

డాక్టర్ : నడవలోకి తీసుకెళ్ళమంటే తీసికెడతా. లేచిరా. (లేవడానికి పార్వతికిసాయపడి చినిగినగుడ్డలుబుజానవేసితీసుకుపెడతాడు) రా రా... జాగర్తగా నడు... నామటుకు నేనూరోగిష్టాణ్నే. సారావిషం!

కొండయ్య : (తలుపు దగ్గర నిల్చుని) సికారా ? పిల్లికూన. బలే! యేం సక్కంగా కుదిరింది జోడు !

డాక్టర్ : దార్లోఅడ్డంతే. కన్పించడంలా, ఇద్దరంరోగిష్టులం...
కొండయ్య : ఊఁ– సరే యెల్లండి...

("చీకంట చాపకండన" అని ముక్కుతో పాడుతూ అనుమానంతో గోపాలం గదిలో వింటున్నట్టు నటించడానికి తల ఎడమవైపుకి తిప్పి ఇల్లంతా చూస్తాడు. గంగులు కనుబొమలకిందనించి కొండయ్యని కనిపెట్టి చూస్తూ తాళపుచేతులు చప్పుడుచేస్తూ ఆకురాయితో రాస్తుంటాడు)

కొండయ్య : అరగతీత్తున్నా?
గంగులు : యేంటీ?
కొండయ్య : 'అరగదీత్తున్నా' అని అడుగుతున్నా. (విరామం) హుఁ ...యిస్...యేంటీ అడగాలనుకున్నా. (తొందరగా తక్కువ శృతిలో) మా ఆవిడ యిలా వొచ్చిందా?
గంగులు : సూడలా...
కొండయ్య : (గోపాలం గది సుమ్మంకేసి నక్కినక్కి వెడుతూ) నెలకో రెండురూపాయలిత్తూ యెంత సోటువాడుకుంటున్నావో తెల్సా? పక్కా, పైగా, కూర్చునే తలం. ఊఁ. నిజంగా మాటాడ్తే అయిదురూపాయిలైనా చేత్తుంది. సరే, పోనీ యింకో అరయిచ్చుకో...
గంగులు : నన్నురేసి సంపెయ్ ... కాటికి కాళ్ళు సాచుక్కూకున్నా యింకాయెలాగో అలాగు యింకో అరగుంజుకుందామనే దురాశాయె.
కొండయ్య : నిన్నురేసి నేనెందుకు సంపాలి? యెవడికీలాబం? నీసుకం నువుసూసుకుంటుండు. దేముడు మేలుసేస్తుంటాడు. అయినా యింకోఅర నీనెత్తినేసేదే...మా దీపారాదనకి కొంచెంనూనికోని మనిద్దరిపాపాలు తుడిచెట్టుకు పోయేందుకు మాయింటి దేముడిముందు యెలిగించు. నీపాపాలను

గురించి యెన్నడైనా ఆలోచించిన పాపాన బోయా? గంగులూ! నువెంతదురమార్గుడివి! నీ నీసత్తంవల్లే నీ పెళ్లాం ఆర్చుకు పోయింది...నువ్వంటే వోరికీ యిట్టంలేదు. గౌరంలేదు...ఆయినపముక్కలు అరగదీయడం...వొకటే అరగదీయడం...అందరికీ అసెంగ మేస్తోంది...

గంగులు: (బిగ్గరగా) నాబతుకు బండలుసేయడానికేనా యిటొచ్చింది?

(సత్యం కేకపెడతాడు)

కొండయ్య: (అదిరిపడి) అరె! బేసైనోడివే!

డాక్టర్: (ప్రవేశిస్తూ) బయట నడవలో ఆవిణ్ణి కూర్చోబెట్టి దుప్పటి కప్పొచ్చా.

కొండయ్య: నీదెంత కనికారపు గెండె భాయ్గా! మంచిపని సేశావ్... పున్యకార్యాల చిట్టాలో యిదీ యెకుతుందిలే...

డాక్టర్: యెపుడూ?

కొండయ్య: సొర్గంలో....అక్కడ ప్రతీదీ, ప్రతిచిన్ని పనీ సిట్టాలో కెక్కుతుంది.

డాక్టర్: నా కనికారానికి ఇక్కడే, ఇపుడే బహుమానం యివరాదూ?

కొండయ్య: నేనెలా యివగలను?

డాక్టర్: నా అప్పులో సగం కొట్టేసి!...

కొండయ్య: హె - హె-హె ఆస్యాలు-నవుతాలు, కనికారపు గుండెకి పాపిస్టి డబ్బు బవుమానమేంటీ? మంచి గుణాలన్నిట్లో కనికారం మా దొడ్డది. కాని అప్పు అప్పే. అంటే

తీర్చుకోవల్సిందే ... నాబోటి ముసిలాడిమీద సూపే దయకి బవుమానం పుచ్చుకోవాలని అనుకుంటారా ?

యాక్టర్ : నువ్వు వొట్టి దొంగముండాకొడకవి ముసిలోడా !

(వంటింటిలోకి వెడతాడు. గంగులు లేచి వసారాలోకి వెడతాడు)

కొండయ్య : (సత్యంతో) ఆ తాళాలోడు పారిపోయాడు. హీ-హీ-నేనంటే బొత్తిగా సరిపడదు...

సత్యం : నువంటే దెయ్యాలకి తప్పితే యెవరికి సరిపడతుంది బాబూ !

కొండయ్య : (ఆటగా) మిమ్మల్నందరినీ ఇంతగా పేమించే నన్ను... నన్నిలా అంటానికి నోరెలా వొచ్చిందంట ! ... మీరంతా నా బీద, దురదుష్ట, పతిత సోదరులని నాకు తెలీదూ ! (హటాత్తుగా తొందరగా) ఆ - ఆ గోపాళం - లోప లున్నాడా ?

సత్యం : నువే చూడు ...

కొండయ్య : (వెళ్ళి తలుపు కొడుతూ) గోపాళం! (వంటింటిగుమ్మంలో ఏదో నములుతూ యాక్టర్ కనిపిస్తాడు)

గోపాలం : యెవరక్కడ ?

కొండయ్య : నేనే - నేనే గోపాళం !

గోపాలం : యేంకావాలి ?

కొండయ్య : (దూరంగా నుంచొని) తలుపుతియి.

సత్యం : (కొండయ్యకేసి చూడకుండా) "తలుపుతీయవే భామ - భామ !" (అని పాడతాడు వెక్కిరింతగా)

(యాక్టర్ బుసకొడతాడు)

కొండయ్య : (ఆందోళనతో మెల్లగా) యేంటి ? యెవరది ? యేంపాట ?

సత్యం : నన్నేనా అడిగేది ?

కొండయ్య : నిన్నే ! యేంటాపాట !

సత్యం : మరేంలే... నాలో నేనదో పాడుకుంటున్నా.

కొండయ్య : వాళ్ళు దగ్గిరుంచుకో భాయీ ! యేళాకోళానికి సమయాసమయా లుండాలి ! (తలుపు గట్టిగా కొట్టి) గోపాళం!

గోపాలం : (తలుపుతీస్తూ) ఊఁ– యెందు కేం ? నాదుంప తెంప డానికా !

కొండయ్య : (గదిలోకి తొంగిచూస్తూ) నేను ... సూచాలే ... నువు...

గోపాలం : డబ్బు తెచ్చా ?

కొండయ్య : నీతో కొంచెం పనుంది గోపాళం !

గోపాలం : డబ్బు తెచ్చా ?

కొండయ్య : యేం డబ్బు ? వో నిమిషం ఆగు...

గోపాలం : యేండబ్బు? గడియారండబ్బు...యేడురూపాయలు యేవీ ?

కొండయ్య : యేం గడియారం గోపాళం ? ... బలే బాగుంది, నువు...

గోపాలం : జాగర్త! నిన్న నేన్నీకు పదిరూపాయలకి గడియారం అమ్మతూంటె అంతా చూశారు. మూడురూపాయలు చేతిలో వేసేట్టు తక్కింది తర్వాతయిచ్చేట్టు. ఇచ్చేయ్, యెందుకూనావంకల్లాగుడ్లుమిటకరించుకుంటూ నిల్చొన్నా?

నీపనేంటో చూసుకోక అందరిపనీ పాడుసేస్తూ ఎందుకలా అందరిచుట్టూ తిరగటం ?

కొండయ్య : యిష్...కోప్పడకు గోపాళం.....గడియారం.... అది...

సత్యం : దొంగసామ్ము!

కొండయ్య : దొంగసామ్ముల్తో నాకేంపనీ!...అమ్మా, యెం తోడిబిరా !

గోపాలం : (బుజాలుపట్టుకుని) యెందుకు ననిలాఠొష్టుపెట్టటం ? నీకేంకావాలి ?

కొండయ్య : నాకా ? నాకేంకావాలి ?...యే మక్కర్లా... నువిలా కోప్పడితే, నేనెల్లిపోతా...

గోపాలం : పో, వెళ్ళి ఆ డబ్బుట్రా.

కొండయ్య : (వెడుతూ) చీ–మోటుమనుచులు.

యాక్టర్ : బలేతమాషా !

సత్యం : బతే––అలాగుండాలి....

గోపాలం : ఆ డిక్కడేంజేస్తున్నాడు ?

సత్యం : (నవ్వుతూ) యేంచేస్తున్నాడా ? ఆ మాత్రం గ్రాహించుకోలేవ్ ! పెళ్ళాన్ని గెతుక్కుంటున్నాడు. వీణ్ణి రెండు తన్ని తరిమేసెయ్యావేం గోపాలం !

సత్యం : ఇలాంటి వెధవల మూలకంగా నాబతుకు పాడుచేసుకుంటా ననుకున్నా ?

సత్యం ; బాగా ఆలోచించుకో. అపుడు కమల నిన్ను మారు మనువు కట్టుకోవచ్చు. నువు మాదగ్గిర అద్దెలు వాసూలూ చేసుకోవొచ్చు.

గోపాలం: తమాషాగానే వుంటుంది? నా చేతికి డబ్బొచ్చే లోపలే నా మంచిదనం ఆసరాచేసుకుని వస్తూ, నా ఆస్తి మీరు తినేస్తారు. (పక్కమీద కూర్చుని) ముసిలిదెయ్యం! తేల్చే శాడు. ఎటువంటి కలొచ్చిందనుకున్నా! చాపలు పడు తున్నాట. పేద్దచాప పడిందట. కల్లో తవితే అంత పేద్ద చాప యెక్కడా కనిపించదు! తాడు చివర చాప. కర్ర విరిగిపోతుంతేమోనని బయమేసింది. అందుకనీ వలసిద్ధంచేసా. ఇక వలవేదామనుకున్నా.

సత్యం: అది చాపకాదు....కమల.

యాక్టర్: కమల్ని ఎన్నడో వల్లో వేసేసుకున్నాడు.

గోపాలం: మీరంతా కట్టకట్టుకు చావండి. చస్తే చస్తే దాన్నిగూడా వెంకబెట్టుకుపొండి.

గంగులు: (వసారాలోంచివస్తూ) ఆబ్బా! ఏంసలి: ఏంసలి!

యాక్టర్: పార్వతిని గూడా లోపలికి తీసుకురాలేకపోయా? బైట బిగుసుకుపోయూరుకుంటుంది....

గంగులు: విమలమ్మ వొంటింటోకి తీసుకుబోయింది.

యాక్టర్: ఆ ముసలాడు తరిమేస్తాడు.

గంగులు: (పనికిమూర్చుంటూ)అలాగైతే తిరిగి తీసుకొచ్చేస్తుందిలే.

సత్యం: గోపాలం! అయిదు రూపాయిలు బదులిద్దూ.

యాక్టర్: (సత్యంతో) హుం-అయిదు! గోపాలం! ఇరవై రూపాయలు బదులీ!

గోపాలం: ఊఁ-తొందరగానేనా! లేకపోతే బేరం వందదాకా యెక్కుతుందా యేం?

సత్యం: ఒహో! ప్రపంచకంలోకల్లా దొంగాళ్ళే బహు దొడ్డాళ్ళు.

గంగులు: (ఆందోళనతో) డబ్బిట్టె ఆళ్ళ కాళ్ళకాడికి డొర్లు కుంటూ వత్తది. పనీపాటా సేచ్చావరు.

సత్యం: చాలామందికి డబ్బు తేలిగ్గా దొరుకుతుంది. కాని యెవడోఒకడుగాని తేలిగ్గా యిచ్చెయ్‌లేడ్రా. పని! పని చూపించు. పనిచేయడంలో ఆనందం వుంది. బహుశా పని దొరికితే చేస్తా. హుఁ—బహుశా. పని ఆనందమైతే బతుకు సుఖంగా వుంటుంది. పని చాకిరైతే బతుకు బానిస బతుకు. (యాక్టరుతో) రా, మైరావణా, రా, పోదాం.

యాక్టర్: పోదాంపద, అహిరావణా. లకుమంది తాగుబోతుల్లా వూరిపోతా. (వెడతారు)

గోపాలం: (ఆవలిస్తూ) నీ పెళ్ళానికెలావుంది?

గంగులు: ఆటేకాలం బతుకుద్దని తోసదు....(విరామం)

గోపాలం: ఇకడిలా వొరుగ్గైపోతున్నావంటే ఆశ్చర్యంగానే వుంది.

గంగులు: యేంసెయ్యాను, గోపాళం?

గోపాలం: యేంలే....

గంగులు: మరిగడవడమెలా?

గోపాలం: యెవళ్ళో వొకళ్ళు సంబాళిస్తారులే....

గంగులు: యెవళ్ళోనా?....ఆళ్ళ్యామనుచులే అంటా? వొట్టి తిరుగుమోతు గాడ్దికొడుకులు! నీసులు! పురుగులు! నేపనోణ్ణి, ఆళ్ళకేసి సూత్తానికే అసయ్యమేత్తుంది. మొపటినుంచో పనిసేత్తున్నా. ఇకడ్నుంచి యెళ్ళిపోతా.

నా చర్మమంతా రాలిపోయినా యికడ్నుంచి పొక్కంటూ అయినా యెళ్ళిపోతా. కొంచెం వోపికట్టు....నా పెళ్లాం వొందర్లోనే సచ్చిపోతది, ఆరునెలల్నుంచే యికడుంటా... ఆరుగాలుగావుంది.

గోపాలం : మేమూ నీయంత మంచోళ్ళమే, నువిలా మాటాడ్డంలో అర్ధం లేదు.

గంగులు : నా అంతమంచా! ఆళ్ళకి గౌరం లేదు...మనసూ లేదు.

గోపాలం : (ఉపేక్షగా) హుం-గౌరవం...మనస్సు! చెప్పాల్లా తొడుక్కోవచ్చా, పెట్టోచ్చా...అధికారంలో వున్నాళ్ళకే గౌరవం, మనస్సూనూ.

భీమన్న : అబ్బా! చలి! బిగుచుకు పోతున్నా.

గోపాలం : భీమన్నా! నీకూ మనస్సుందీ?

భీమన్న : యేందదీ?

గోపాలం : ఆ - అదే - అదే.

భీమన్న : నాకెందుకూ? నేనేం లచ్చాధికార్నా!

గోపాలం : అదే నే చెప్పేదీనీ. డబ్బున్నాళ్ళకే గౌరవం మనస్సూ కావాలి. కాని గంగులు మనమీద కేక కావాలేస్తున్నాడు. మన మనస్సులు...

భీమన్న : యేం, కావాలంటున్నాడా? మనసు యెరువ్వాలంటున్నాడా?

గోపాలం : యెబ్బే! ఆతగాడికి మాంచి మనసోటుంది.

భీమన్న : (గంగులుతో) అదాయిసయం! అమ్మాలనా? యికడ కొనేడిసే వోళ్లెవరూలేరు. పాతచీట్లపేకైతే...అదైనా అరువెడితే-యేమోనాకేమైనా కొనాలని బుద్ధిపుడతదేమో!

గోపాలం : (ఉపదేశపూర్వకంగా) నువ్వుపట్టిముద్దు రా చి ప్పి శి గంగులూ! మనసు విషయంలో సత్యంమాటా, రాజా మాటావింటంమంచిది.

గంగులు : ఆళ్ళునాకు నేర్పినచ్చేదేందంట!

గోపాలం : తాగుమోతుతైనా నీకన్న తెలివిగలాళ్ళేతే.

భీమన్న : తాగుడూ, తెలివీ రెండుంటే రెండింటాలా లాబం.

గోపాలం : సత్యం అంటాడూ "ప్రతివాడికీ తన పొరుగువాడికి మనస్సుండాలంటాడు. కాని తనకీ వుండాలనే జ్ఞానం ఒక డికీలేదు."...అదే నిజం!

(ప్రవేశం విమల. వెనక రామదాసు చేతిలో కర్ర, బుజాన సంచీ.)

దాసు : 'శుభోజ్జయం' సత్యప్రభువులకి శుభోజ్జయం!

గోపాలం : (మీసం దువ్వుతూ) ఆ-విమలా!

భీమన్న : పూర్వం - రెండేళ్లకితందాకా మేమంతా సత్రె అరిచ్చందులమే.

విమల : కొత్తగా వుంటాని కొచ్చారు.

దాసు : 'ఆత్మవత్సర్వభూతాని' అన్నారు పెద్దలు. జీవాత్మ లన్నీ ఒక్కటే. అబద్ధాలకోర్లన్నా నాకు గౌరవమే. మనదృష్టిలో వుందిగాని దోమకూ్కడా దానికుండే సద్గు ణాల్దానికి వున్నాయ్. అన్నీ నల్లగా వుంటయ్, అన్నీ ఎగురుతయ్. ... యింతకీ నాకు చోటెక్కడ చూపుతావే చిట్టితల్లీ!

విమల : (వంటింటి తలుపుకేసి చూపుతూ) అదిగో, అక్కడా తాతయ్యా!

దాసు : మా తల్లి బహు దొడ్డతల్లి! సాక్షాత్తూ అన్నపూర్ణే! ఎక్కడ వుండమంటే అక్కడే వుంటానమ్మా. యేమూాల వెచ్చగావుంటే అదే ముసిలోళ్ళకి యిల్లూవాకిలీ.

గోపాలం : బలే చిత్రమైన వాణ్ణి పట్టుకొచ్చావే విమలా!

విమల : నీకంటేనా?...గంగులూ! నీ పెళ్ళాం మావంటింటో కూర్చునుంది. కాసేపుండొచ్చి తీసుకుపో.

గంగులు : సడే అలానే వత్తా.

విమల : నీ పెళ్ళాంమీద దాక్షిణ్యం సాలించి ఇకైనా కాస్త దయతో చూద్దూ, పున్నెముంటుంది. అట్టేకాలం బతికి సచ్చేనా?

గంగులు : నాకు తెలుసులే.

విమల : తెలీడం సాలదు. పరిస్థితి అర్థం చేసుకోవాలి. ఇంతకీ చావంటే మాటలా? అందరికీ భయమే!

గోపాలం : హుం-నాకేం భయంలేదు.

విమల : (వేళాకోళంగా) మా ధైర్యస్తుడివిలే! నీకేం భయం!

భీమన్న : "మేడిపండుసూడ మేలిమైయుండును
పొట్టయిచ్చిసూడ పురుగులుండు."

గోపాలం : సత్యప్రమాణంగా చెబుతున్నా, నాకేం భయం లేదు. ఇపుడే, ఈక్షణంలో, ఇలానే వున్నపాళంగా చచ్చి పొమ్మంటే చచ్చిపోతా. ఆ కత్తి తీసుకుని నాగుండెల్లో పొడిచేసెయ్. గుక్కెడు నీళ్ళైనా అడక్కుండా చచ్చూరు కుంటా. నీ సుకుమారపు చేతులుమీాదుగా చావడమంటే నాకు పరమానందం. ఊఁ-పొడిచెయ్.

విమల : ఎవర్ని టోపీవేద్దామనే, యీ నాటకమంతా.

భీమన్న : "పొట్ట యిచ్చి సూడ పురుగులుండు"
విమల : (గుమ్మంలోంచి) నీ పెళ్లాంసంగతి మర్చిపోకేం గంగులూ!
గంగులు : సడే.
గోపాలం : నీకు తగినపిల్లే!
భీమన్న : దానికేం దొబ్బిడాయా!
గోపాలం : నాతో అలా మసులుతుందేం! ఊఁ — తప్పించుకు తిరుగుతోంది పిల్ల. ఇక్కడ వుంటే పూర్తిగా పాడై పూరు కుంటుంది.
భీమన్న : పాడైపోతే నీమూలంగానే.
గోపాలం : నామూలంగా'నా! అదంటే నాకెంతో దయ...
భీమన్న : ఔసాను. పిల్లికి యెలికంటే మా దయ...
గోపాలం : అబద్ధం! పచ్చిఅబద్ధం! అదంటే నాకెంతోదయ! ఇక్కడ దానిబతుకు మహాభారంగా వుందని నే కనిపెట్ట లేదనుకున్నా?
గంగులు : ఆ-యిమలతో మాటాడుతుండగా కమలు సూడాలి నాసామిరంగా...
భీమన్న : కమల!...కాత్తోకూత్తో లాబంలేందే ఏపనీ సేచ్చా వదు, రాచ్చసిముండ!
గోపాలం : (పడుకుంటూ) ఏడ్చాల్లండోయ్.
గంగులు : సడే-సూడకపోతాం...
దాసు : (వంటింటిలో) "బ్రహ్మపట్నం పోదమంటే చీకటేమిర అన్నయా!"

గంగులు : (నడవలోకి వెడుతూ) యెందుకట్టావోండ్రెడుతున్నాడా కొత్తోడు.

గోపాలం : అబ్బా ! యేంవిసుగ్గా వుందిరా దేవుడా! అప్పుడప్పుడు యింతవిసుగెత్తుతూ వుంటుందెందుకూ ? రోజులకి రోజులు యిట్టే హాయిగా గడిచిపోతాయి. కాని అమాంతంగా చలిజరంలావొచ్చి పడ్తుంది విసుగు! నరకంరా, బాబూ, నరకం!

భీమన్న : యిసుగూ! ఊఁ

గోపాలం : ఆఁ—

దాసు : 'చీకటేమిర అన్నయ'

గోపాలం : ఆ—నిన్నే. తాతా! ఆ సంగీతంగింగీతంకట్టెెయ్.

దాసు : (నవ్వు) యేం బాగుండలా?

గోపాలం : మంచి సంగీతమైతే బాగుంటుంది.

దాసు : అంటే నా సంగీతం బాగుండలేదన్నమాట.

గోపాలం : బలే బాగా గ్రహించావ్.

దాసు : అలా అనకండీ బాబూ - నాది మంచిగొంతనుకుంటున్నా. మనిషి తాను చేసేదంతా బాగుందనుకుంటాడు. కాని యితర్లకది బాగుండకపోవచ్చు. ఈ లోకంలో ఎపుడూ యింతే—ఏంచేస్తాం.

గోపాలం : నిజం తాతా, నిజం! (నవ్వు)

భీమన్న : యిసిగెత్తిందో అని యిపుడేగా గోలెట్టావ్. ఇంతట్లోకే యేందా నవులు—గివులు.

గోపాలం : నీకెందుకురా, ముసిలెధవా !

దాసు : యేప్పిటీ ! యెవరికి విసుగెత్తింది ?

గోపాలం : నాకు.

(రాజా ప్రవేశం)

దాసు : అలా అనకండిబాబూ ! మరే, వంటింట్లో ఓ అమ్మాయి పుస్తకం పట్టుకుని ఏడుస్తూ కూర్చుంది. కన్నీళ్ళు కాలవలు గడుతున్నాయ్. నేనడిగా "ఎందుకే చిట్టితల్లీ" అని. ఆ అమ్మాయి "పాపం వాడు" అంది. దానిమీద 'ఎవడే వాడు ?' అనిమళ్ళీ అడిగా. 'ఇదిగో! ఈపుస్తకంలోవాడు.' అని జవాబు చెప్పింది. ఇలా పిచ్చిపుస్తకాలు చదువుతూ పొద్దుపుచ్చడ మెందుకో? మీలాగానే విసిగెత్తిపోయేనా?

రాజా : ఆపిల్ల వొట్టి పిచ్చిపిల్ల.

గోపాల : ఓహో ! రాజా ! టీ తాగా ?

రాజా : ఆఁ–ఆ తరవాత.

గోపాలం : ఓ గ్లాసు కల్లుతేనా ?

రాజా : ఊఁ – ఆ తరవాత ?

గోపాలం : ఆ తరవాత–నాలుక్కాళ్ళమీద నిల్చుని కుక్కలా మొరుగు. తెలిసిందా.

రాజా : ఓరి నీ తెలివి తెల్లార ! నువ్వేం చీకటి యూపారివా ? తప్పతాగావా ?

గోపాలం : ఊఁ – కానీ – మొరుగు. నువు మొరుగుతుంటే నా మనసు సంతోషిస్తుంది. నువు ఘరానా మనిషివి... ఒకొపుడు నాబోటివాళ్ళని మనుషులకింద జమకట్టేవాడివి కాదు కదూ ?

రాజా : భేష్–ఆ తరవాత.

గోపాలం : అందుకేకుక్కలాగా మొరగమంట. మొరుగుతావ్ కదూ? నిన్నే? విన్పించిందా?

రాజా : సర్రే, వాజమ్మా, మొరుగుతా. కానీనీకంటె వో మెట్టు కిందికి దిగజారినాడిని నే మొరిగితే నీకేం సంతోషం చెప్పూ. నీకంటె పై మెట్టులో వున్నప్పుడు నన్నిలా మొరగ మంటానికి నీకు దమ్ములుండేవి?

భీమన్న : నిజం! రాజా! నిజం!

దాసు : బలే! బలే! వజ్రాల్లాంటి ముక్కలు వదిలావ్. బలే రాజా!

భీమన్న : ఆగూ—అయిందేదో అయేపాయె. యికమిగిలిందే ముంది నాబూడిద. మీజాతిగరానా మనసులేరూ యికడ సావలా. అందరిపనీ మట్టమైంది. మిగిలిందల్లా జానెడు గోసిగుడ్డా, రాయిచెంబూ.

దాసు : అంటే అంతా ఒకగాడిసే దేకుతున్నా రన్నమాట అయితే నువ్వునిజంగా రాజావేనా రాజా?

రాజా : యేవిటి సంగతీ ? యెవర్నువ్వు ?

దాసు : (నవ్వుతూ) నేను, మహరాజుల్ని చూచా. యువరాజుల్ని చూచా. కాని నీలాంటి తరాజుల్ని మట్టుకిచూడలా.

గోపాలం : రాజా ! నవ్వుతూ) యేం....

రాజా : దేనికైనా సమయాసమయాలుండాలి గోపాలం !

దాసు : ఛీఛీఛీ ! మీ బతుకుచూస్తే....

భీమన్న : యేడుత్తూ నిద్రోడం, మూల్గుతూ మేలోకడం. ఇదీ మా బతుకు.

రాజా : పూర్వం, మనం బతికున్నరోజుల్లో, పొద్దున్నే కళ్ళు తెరిచే సరికి కాఫీ, బిస్కత్తులు పక్కమీదకి వచ్చిపడేవి....

దాసు : మన మంతా మనుషులం. యెంత దర్జా వోలకబోసినా, యెన్నెన్ని వేషాలేసినా, మనమంతా మనుషులమై పుట్టాం, మనుషులుగా నే గిడతాం. ఈ రోజుల్లో మనుషులకి తెలివితేటలు లెక్కువై పోతున్నాయ్ బాబూ! బతుకు దిగజారిపోతున్నకొద్దీ మనుషులు బాగా బతకాలని ఉవ్విళ్ళూరిపోతున్నారు. వొట్టి మొండి జాతి!

రాజా : తాతా! యెవర్నువు? యెక్కడ్నించి వచ్చావ్?

దాసు : నేనా?

రాజా : తీర్థాలు సేవిస్తున్నావా?

దాసు : ఈ భూమ్మీద మనబతుకే వో తీర్థయాత్ర. ఈ మన భూగోళం వుందే అది – అదికూడా ఆకాశంలో తీర్థయాత్ర సాగిస్తోందని పెద్దలు చెబుతూంటారు.

రాజా : (గంభీరంగా) సాగిస్తే సాగించనియ్.

గోపాలం : రాజా, పద. ఓగ్లాసు....

రాజా : ఊ–తాతా! శెలవు–నువ్వు వట్టి దగుల్బాజీవి తాతా! తెల్సిందా?

దాసు : ఈ విశాల ప్రపంచంలో రకరకాల మనుషులు!....

గోపాలం : (తలుపుదగ్గిరనుంచి) వస్తే తొందరగా రా, పోదాం.

(వెడతాడు. వెనక తొందరగా రాజా)

దాసు : ఆయన పూర్వం రాజాగారేనా?

భీమన్న : యేమో యెవడికి తెలుస్తది. రాజా కుటుంభంలో వాడన్నదిమాత్రం నిజం. అలా అనుకోటానికి తగట్లు అమాంతంగా యేదో సేత్తుంటాడు. పా తలవాట్లింకా వొదిలిపోలా మా రాజాకి.

వాసు : బిడ్డ చచ్చినా పురిటివాసన వదల్లేదన్నమాట !

భీమన్న : మొత్తంమీద పర్వాలేదుగాని అపుడపుడు మాటుకు వత్తాంటది, రిమ్మ తెగులు.

ముత్తాయి : (తాగితూలుతూ చిలకబుర్ర వాయిస్తూ ప్రవేశం)

"రావి సెట్టెక్కేవు–రాగాలు తీసేవు
రాలిపోతవు– లంజకొడకో రెంకయ్యో
రాలిపోతవు– లంజకొడకా!"

యెవరోసి ! యెవరోసి !

భీమన్న : యేంటట్టా అరుత్తున్నా ?

ముత్తాయి : బుద్ది బుద్ది సాజంగా నే తలబిరుసోణ్ణిగాదు బాబు గోరూ.

భీమన్న : మల్లీ తప్పతాగావాయేం?

ముత్తాయి : ఆ–తాగా, తాగా, గొంతుదాకతాగా. పోలీసు పోలాయ స్టేసన్నుంచి బైటికిగెంటి "మల్లీ బజార్లోకి అడు గెట్టావో సూపిత్తానాతడ్డా" అన్నాడు. మనం నీతిగలోళ్ళం. మాధొర నను సూసేతలికి పల్లుపటపటా పటపటా కొరుకు తాడు. ధొర–ఫూ–ధొర! పచ్చిమోసం!...ఆడొట్టి తాగు మోతోడు. యెవడై తేమటుకు నాకేంలెక్కంట ! ...నాకేం అక్కర్లా:... (రాధ వంటింట్లోనుంచి వస్తుంది) ఇద్దో లచ్చ రూపాయలిత్తామనండి. నాకేమక్కర్లా. తప్పతాగేవోడి మోసేతిసీళ్ళు తాగుతూ – దిలాసాపురుషుణ్ణి నేను పడుం టాననుకున్నా ? హా – హా – హా ... నేనాడికింద పని సేయనేసేయను. ఆడి ఆటలు నా దగ్గిరా (రాధ ముత్తాయిని చనిపెడుతూ తలూపుతుంది)

దాసు : (దయతో) యెంగతి పట్టిందిరా నీకు బాబూ !

భీమన్న : వొార్త్రిమట్టిబుర్ర ! మట్టిబుర్ర !

ముత్తాయి : (నేలమీదపడి) ఇద్గో, నను తినేసేంది. నాకే మక్కర్లా. ఇది మొండి గటం. నాకంటె గొప్ప పనోడెవడో సెప్పు సూదాం ? మరి నాగ తిలాపట్టిందేం ? 'యీాదిలో కొచ్చావో నీ కల్లుముంత ముక్కల్ముక్కల్ సేసేత్తా' నన్నాడుగదూ పోలీసు పోలాయు, ఏంచేస్తాడో నేనూ సూత్తా. యీాదిలోకెల్లి నడిమద్దెన వడకేస్తా. బల్లూా గర్రా నామీాదగా పోసి. నాకేమక్కర్లా.

రాధ : పాపం ! పట్టుమని పాతికేళ్ళు లేవు, యెలా నవులపాలవుతున్నాడో !

ముత్తాయి : (రాధనుచూచి మోకాళ్లమీద నిలిబడి) చిన్నిదొార్సానీ, మాాలచ్చివిా, చమించుతల్లి, చమించు తప్పతాగా.

రాధ : (రహస్యంగా) ఁుష్ — కమల !...

కమల : (తొందరగా తలుపుతీసి ముత్తాయితో) మళ్ళీ ప్రత్యక్షమయ్యావట్రా ?

ముత్తాయి : బాగుండోరా దొార్సానీ ! మీా దయ...

కమల : ఈ చాయలకి రావద్దని చెప్పానా, కుక్కలకొడకా! మళ్ళీ ఎందుకొచ్చా ?

ముత్తాయ్ : దొార్సానీ! ఒక్కపాట—సావుపాట పాడినిపించనా?

కమల: పో, అవతలకి పో. (భుజంపట్టుకొని తోస్తుంది)

ముత్తాయి ; ఒక్కనిమిచం ... కొత్తంగా నేర్చుకున్నా ... సరికొత్తబాణీ...ఒక్కనిమిచం...నను గెంటెయ్యకేవ్.

కమల : గెంటెయ్యగల్నో లేదో చూపించనా? వీధివీధినంతా నీమీద ఉసిగొల్పగల. వేలెడువెధవ్వి నామీదే యాగీ మొదలెట్టా.

ముత్తాయి : (పరుగెత్తుతూ) పోతున్నా - నే నెల్లిపోతున్నా.

కమల : (భీమన్నతో) ఆ చచ్చినాణ్ణి మళ్ళీ యిక్కడ అడుగుపెట్ట నిచ్చావో, ముందు నీపని పట్టిస్తా.

భీమన్న : నేనేం నీ కాపలా కుక్కననుకున్నా ?

కమల : కుక్కవో! నక్కవో నాకదంతా తెలీదు. నాదయా ధర్మ బిచ్చంమీద బతుకుతున్నావని జ్ఞాపకముందా ? నువ్వు నాకెంత బాకీ-చెప్పు.

భీమన్న : లెక్కకట్టలా.

కమల : నే లెక్కకడతా-సగేనా.

ముత్తాయి : (తలుపుతీసి బిగ్గరగా) కమలమ్మగోరూ నను గెంటెయలేవ్. గెంటెయలేవ్. (దాక్కుంటాడు. దాసు నవ్వు)

కమల : (దాసుతో) నువెవరివి ?

దాసు : దారిబోయేవాణ్ణి....యాత్రీకుణ్ణి.

కమల : యీవాళటికేనా, ఇక్కడేవుండిపోతావా ?

దాసు : చుట్టూ వోమాటు చూడ్నీ !

కమల : యాత్రికుడివో, బటాచోరువో ! యెలా తెలుస్తుందేం?

దాసు : (నిట్టూర్చి) ఊహు-అసాధ్యురాలివే !

[కమల గోపాలం గది గుమ్మంలోకి వెడుతుంది. ముత్తాయి వంటింటి గుమ్మంలోంచి తొంగిచూస్తూ "యెల్లిపోయిందా" అని అడుగుతాడు.]

కమల : ఇంకా యిక్కడే చచ్చా.

(ఈలవేస్తూ ముత్తాయి వెడతాడు. దాసు, రాధ నవ్వుతారు.)

భీమన్న : (కమలతో) ఈడ లేడు.

కమల : యెవరూ ?

భీమన్న : గోపాళం

కమల : గోపాలం యెక్కడున్నాడని నేనడిగానా పెట్టానా ? మరెందుకూ...

భీమన్న : అడగాలీ ! యేంబుకల్లతో యెదుసుతూంటే!

కమల : అంతా సవ్యంగా వుందో లేదో అని చూస్తున్నా. తెలిసిందా? ఇంతవరదాకా కొంప ఊడవనేలేదేం. కొంపంతా శుబ్బరంగా వుంచమని ఎన్నిసార్లు మొత్తుకున్నాగాను.

భీమన్న : యియేల వూడ్చటం యొక్కరొంతు.

కమల : ఎవరొంతైతే నాకేం. నాక్కావలసింది వూడ్చటం. సాయింత్రి ఇనస్పెక్టరొచ్చి జుల్మానా వేసాడో మిమ్మందర్నీ తరిమేస్తా.

భీమన్న : (శాంతంగా) మమ్మల్నందరినీ తరిమేసి నువ్వేంతింటా?

కమల : కాస్త చెత్తంటూ కన్పించాలి మీతాళంపట్టిస్తా. (వంటింటివైపు వెడుతూ రాధతో) ఇక్కడ తచ్చాడుతున్నావేం? మొగమంతా అదేమిటలా వాచింది ? బుట్టబొమ్మలా అలా నిల్చొకపోతే కాస్త వూడిస్తే నీ సొమ్మేంపోతుందే ? మా విమల కన్పించిందా ?

రాధ : నాకేం తెలీదు... నే చూడలా.

కమల : భీమన్నా మా చెల్లి యిలా వొచ్చిందా ?

భీమన్న : (దానును చూపిస్తూ) ఈయనగోర్ని తీసుకొచ్చింది.

కమల : అతను... అతనింటో వున్నాడా ?

భీమన్న : ఆ-యిమలమ్మ గోపాలంతో యేంటో గుచగుచలాడి వోయింది.

కమల : యెవరితో మాటాడిందీ అని నిన్నడిగానా యేం-ఊఁ- యెక్కడ చూసినా చెత్త...కంపు ... ఉచ్చాల గుంపు. అంతా శుబ్బరం చేయండి. విన్పించిందా ? (గబగబా వెళ్ళి పోతుంది)

భీమన్న : వోర్ని చండాలపుముండ !

దాసు : ఉహుఁ-యిక్కడ మన పప్పులేం వుడకవ్ !

రాధ : ఇలా బతుకుతూంటె ఎవరైనా యిలానే నీచడి పోతారు. అలాంటి దద్దమ్మల మెడకికడితే...

భీమన్న : మరీ గట్టిగా బిగించి కట్టడిత్తేగా...

దాసు : యెప్పుడూ యిలా నిప్పులు గక్కుతూనే వుంటుందా యేం ?

భీమన్న : యెప్పుడూ యింతే. రంకుమొగుణ్ణిసూసి పోదాంటు నొచ్చింది, దరిశనం కాలా. సమయానికి యేడకో వుడా యించాడు.

దాసు : ఇంకేం నిప్పుల్లో నెయిపోసినట్టే (నిట్టూర్పు) అధి కారం చెలాయిస్తూ, తిడుతూ, కొడుతూ యింతమంది భూమ్మీద రొమ్ములు విరుచుకుని తిరుగుతున్నా శాంతీ లేదు, భద్రతా లేదు.

భీమన్న : ఆళ్లూసాంతికావాలంటారు. కాని ఆ సాంతి సాదిత్తానికి తలకాయెక్కడేడ్చినదంట ! సడే-యేడో వోడు వూడ వక తపుతుందేంటి. రాదా! కొత్త నువూడుద్దా.

రాధ : నేనేం నీదాసీదాన్ననుకున్నా? (ఒకనిమిషం ఆగి) ఇవాళే తాగేస్తా. గొంతుదాకా తాగేస్తా.

భీమన్న : ఊఁ—కానీ—అదైనా కాస్త నయమే.

దాసు : యేమిటీ? తాగుతా? ఒక్కక్షణం కితమేగా యేడుస్తూ కూర్చుంటి! ఇంతట్లోకే యీపాడు బుద్ధెందుకు పుట్టిందమ్మా?

రాధ : (సవాలు చేస్తున్నట్టు) తాగుతా — తాగుతా. తాగి మళ్లీ యేడ్పు మొదలెడతా—అంతే.

దాసు : తాగడమెందుకు?

రాధ : (అంతేనని తలూపుతుంది)

దాసు : అరెరెరే— యేం మనుషులు— యేం మనుషులు! యేంగతేం కానుందో భగవాన్! పోనీ — నే నూడుస్తా, చీపిరేదీ?

భీమన్న : అద్గో — ఆ తలుపుసాటున.

(దాసు వెడతాడు)

భీమన్న : రాదా?

రాధ : యేం?

భీమన్న : కమలమ్మోరు ముత్తాయ్గాడిక్కాద అలా యిరుసుకు పడుతోందేం?

రాధ : కమలంటే మోహంమ్మొత్తి గోపాలం విమలని చేరదీస్యాలని సూస్తున్నాడని ముత్తాయ్ వూళ్ళో యీగి మొదలెట్టాడు. అందుకూ యీ విరుచుకు పట్టమంతా, యిక్కణ్ణించి నే మకాం మార్చేయటం మంచిదనుకుంటా.

భీమన్న : యేంటీ — మకాం మారుత్తావా? యెక్కడికేం?

రాధ : నా కిక్కడ వొంటినిండా చీమలు, జెర్రులు పాకుతున్నట్టుంది. ఇక్కడ నాజోలెవరిక్కావాలి?

భీమన్న : (శాంతంగా) యాడకెల్లి నా సిజోలెవరిక్కావాలే తల్లీ! ఈ పెపంచకంలో వోరిజోలోరిక్కావాలి!

[రాధ తలుపుతీసి తొందరగా వెళ్ళిపోతుంది. దాసు వెంటరా పోలీసు పోలయ్య ప్రవేశం]

పోలయ్య : యెవర్నువ్వు? యెరుగున్న మొగంలా లేదే?

దాసు : యిక్కడివాళ్ళందర్నీ యెరుగున్నా?

పోలయ్య : నా బీటులోవాళ్ళందర్నీ యెరుగున్నా. నిన్నెరగనే!

దాసు : ఈ భూప్రపంచమంతా నీబీటుకిందికి వస్తుందా యేం? నీ బీటుకిందికిరాంది చాలావుంది. అందుకే నన్నెరకపోవటం. తెల్సిందా!

(వంటింటోకి వెడతాడు)

పోలయ్య : (భీమన్న దగ్గిరకె వెళ్ళి) నా బీటు పెద్దది కాకపోవచ్చు కాని తక్కినవాటికేం తీసిపోలా ... ఇక ముత్తణ్ణి సేసనికితీసుకు పోవాలి. ఇన్నావా బీమాన్నా! రోడ్డు నడిమద్దెన పడి వాయిద్దెం - వాయిద్దెం వాయిత్తూ 'నాకేమక్కర్లా, నాకే మక్కర్లా' అని వోకటేగోల! బళ్ళూ, కార్లూ, మీాదినించి పోవాల్సింది, అబ్బాయిపని తెలిసొచ్చేది. రోగంగుదిర్చా. యెప్పుడూ పోట్లాటకి తయారు. వొత్తి కొంటెదవ.

భీమన్న : రాతిరికి పుల్జూదం ఆడదాం వస్తా?

పోలయ్య : ఆఁ- ఆ గోపాళం ... యెలా వున్నాడు? బతికే వున్నాడా?

భీమన్న : యేం రోగం? గుండులా బలిసిండు.

పోలయ్య : (అనుమానిస్తూ) అలాగా?

(కుండ బుజానపెట్టుకుని బాసు నడవలోనుంచి ప్రవేశం)

పోలయ్య : గోపాళం విసయంలో... హుం... యెహో పుకార్లు బయల్దేరాయ్! యినలా?

భీమన్న : పుకార్లు గంపెడిన్నా.

పోలయ్య : కమల విసయం... యేవన్నా కనిపెట్టా?

భీమన్న : యేవన్నా అంటే?

పోలయ్య : యెదైనా సరే... తెలిసే దాస్తున్నా? నలుగురిలో పడిపోయింది. (గట్టిగా) అబద్దాలు, సుబద్దాలు నా దగ్గిరేం సాగవ్, తెలిసిందా?

భీమన్న : అబద్దాలాడేటంత కర్మం నాకేం బట్టింది?

పోలయ్య : యెదో గూడుపుటాణి! పుచ్చుకక్కలు! కమలకీ గోపాలానికి యిలాకా వుందంటున్నారు. నీకేమేనా తెలుసా? పోనీ నాకేం - నేనేం వాళ్ళ బాబునా? ఎందుకూ నను జూసి అలా నవుతారు? (సుబ్బి ప్రవేశం) వాళ్ళకేం పోయకాల మొచ్చింది? పెతివోళ్ళకేసీ సూసి నవ్వడం? ఆఁ- నువ్వా? అపుడే తిరిగొచ్చా?

సుబ్బి : ఒహోహో! పోలీసు దొరగారా? బీమన్నా, మల్లీ బజార్లో యీడు నామచ్చమాపుతున్నాడు. యీణ్ణి పెల్లాడాలంట! ఈమొగానికి పెల్లిటా-పెల్లి!

భీమన్న : ఊఁ-కానీ. ఆడికేం డబ్బుకొదవా, రూపం కొదవా?

పోలయ్య : హోహో! బలేభాగా సెప్పావ్ బీమన్నా! అలా బుద్దిసెప్పి యెదో పున్నెం గట్టుకో. వోకాయ కాస్తే నీ పేరెట్టుకుంటా.

సుబ్బి : ఒక్క్నిజిమ్మడ! నను రెచ్చగొట్టమాకు. వోమాటైంది, ఆసంబడం... ఆడది పెళ్ళాట్టమంటేనిలువునా గోతిలో పట్టమే. వోమాటు పడిందో యిక జనమజనమలకీ మర్సపోదు.

పోలయ్య : గుర్రాన్నికట్టెయ్! మొగోళ్ళంతా అచ్చోసినట్టు వోమాదిరీగానే వుంటారంటా?

సుబ్బి : వుండకపోవొచ్చు కాని నేనుసెనే. ఆసచ్చినోడున్నాడే నా మొదటి మొగుడు – ఆడుసావంగానే నా అదుట్టాన్ని పాసుమకుంటూ వోరోజు రోజల్లా అలా నేకూకుండిపోయా.

పోలయ్య : వుత్తపున్నానికి కొడుతూంటే పోలీసోళ్ళకి రిపోర్టి యిక పోయా, రోగంకుదిర్సేవాళ్ళు.

సుబ్బి : పదేళ్ళపాటు రోజూ దేముడితో మొరెట్టుకున్నా. యేంలాబం? ఆ బండరాత్తో సెబితే యెంతో దేముడితో సెపినా అంతే.

పోలయ్య : యీరోజుల్లో పెళ్ళాన్నిగొట్టడం నేరం. ఓక్కరూల్సు. లా అంతు ఆడకు. తగినకారణంలేందే వోర్ని కొట్టగూడదు. సాంతిరచ్చనికి షటుకు అడపాదడపా వోతడి తగిలించొచ్చు.

దాసు : (పార్వతిని తీసికొస్తూ) ఇంత బలహీనంగా వున్నావ్. నీయంతటనువెలా రాగలవమ్మా, నీ పక్కెక్కడ?

పార్వతి : (పక్క చూపుతూ) నీ ఋణం తీర్చుకోలేను తాతా!

సుబ్బి : అద్గో! పెళ్ళాడిన ఆడది. దాన్ని సూడు!

దాసు : వొణికిపోతోంది పాపం! గోడపట్టుకుని మూలుగుతూ నడుస్తోంది. ఇలాటి మనిషిని వొంటరిగా వెళ్ళనిస్తారా?

సుబ్బి : చమించు బాబూ, యెదో సూడలా. ఈ రాణిగోరి దాసి యీయాల సెలవెట్టినట్టుంది!

దాసు : హాస్యానికిదేనా సమయం! ఇలాంటి రోగిష్టిని కనిపెట్టు కుండొద్దూ? యెటువంటి వాళ్ళయినా వాళ్ళకుండే విలవ వాళ్ళకుంటుంది. యేవంటా?

పోలయ్య : వోపక్క కనిపెడుతుండాలి. అమాంతంగా సచ్చి పోతే...కాత్త కనిపెట్టుండాలి.

దాసు : నిజం, హెడ్డూ!

పోలయ్య : నేనింకా హెడ్డునుగాలా.

దాసు : అలా అనకు. నీ వాలకంసూస్తే అచ్చంగా హెడ్డు లానే వున్నావ్.

(తెరలో అల్లరి, గోల, పెడబొబ్బలు)

పోలయ్య : యెవరో కొట్టుకుంటున్నారు.

భీమన్న : సడిగ్గా అలానేవుంది.

సుబ్బి : యెల్లిసూసొత్తా.

పోలయ్య : నేనూ యెల్తా. ఓ – యేం డూటీరా, బాబూ, యేం డూటీ! కొట్టుకునే వోళ్ళని మేమెందుకూ యిడ దీయటం! అలిసిపోతే గువ్‌చిప్‌గా యెవళ్ళిళ్ళకి ఆళ్ళే సక్కా బోతారు. వోపికున్నంతవరకూ కొట్టుకోనివడమే మెరుగు. మళ్లీ జనమలో కొట్లాటకి దిగరు.

భీమన్న : (లేచి) యీసంగతి యెల్లి మీ యినస్పెక్టరుతో సెప్పిసూడు, యేమంటడో?

కొండయ్య : (తలుపుతీసి బిగ్గరగా) పోలయమావా! తొందర గరా, తొందరగ. కమల, యిమల వెంటడింది, సంపే స్తుంది. తొరగరా.

(సుబ్బి, పోలయ్య, భీమన్న పరుగెత్తుతారు. దాసు తలూపి వాళ్ళ కేసి చూస్తుంటాడు.)

పార్వతి: రామ రామ! పాపం! యిమల...

దాసు: యెవరా పోట్లాడుకునేది?

పార్వతి: యీ యింటి కామందులు. అప్పా-సెల్లెలూ——

దాసు: (పార్వతి దగ్గిరికెళ్ళి) యెందుకూ పోట్టాడుకోవడం?

పార్వతి: మరేంలే, వాంటిమదం!

దాసు: నీ పేరేవిటమ్మా?

పార్వతి: పారతి...నిను సూస్తుంటే మానాన- యెంతమంచో డనుకున్నా-గ్యాపకం వత్తున్నాడు.

దాసు: ఆ-డక్కా-మొక్కీ-లు చాలా తిన్నానమ్మా...అందుకే నాలో యీ కాస్త మంచన్నా పుట్టుకొచ్చింది.

(వెకిలినవ్వు)

[తెర]

# రెండో అంకం

[అదే స్థలం. సంధ్యావేళ. సత్యం, జోగాయ్, రాజా, సాహెబ్ పేకాడుతున్నారు. గంగులూ, యాక్టరూ ఆటచూస్తున్నారు. భీమన్నా, పోలయ్యా భీమన్న తిన్నెమీద పుల్జూదం ఆడుతున్నారు. దాసు పార్వతి పక్కన కూర్చున్నాడు. చీట్లపేకదగ్గరో దీపం, పుల్జూదందగ్గిరో దీపం.]

సాహెబ్ : హింకా వొక్కదఫే హోడుతాం – హంతే.

భీమన్న : జోగాయ్! యెదీ పాటందుకో...

(పాట) " యెందుకైతే వుంచినావీ బందిఖానలో "

జోగాయ్ : రామా నామొఱా వినవయ్యా! ॥యెందు॥

సాహెబ్ : పేకాకల్పూ భాయ్! భాగాకల్పూ, మీ హోటా సంగ్తీ మాకీ తెలియాదనుక్కుండావ్.

భీమన్న, జోగాయ్ : (కలిసి పాట)

పన్నెండు యేండ్లాయె
ఒడలీ కాహారము లేదూ
కండ్ల నిద్రయినా లేదూ ॥యెందు॥

పార్వతి : పొద్దత్తమానం కీచులాట – సెప్పుదెబ్బలు... ఇదీ నా బతుకు... అంతకిమించి నేబాముకుందేముంది నాయనా!

దాసు: మా అమ్మవిగదూ, దిగులెట్టుకోకమ్మా, దిగులెట్టుకోకు.

పోలయ్య : యేయ్, యేంటా దూకుడు! ఊ-జాగర్త.

భీమన్న : ఊ!—

సాహెబ్ : (పిడికిలితో సత్యాన్ని బెదిరిస్తూ) ఫేకాముక్కల్ దాస్తుండావే? యేం?

జోగాయ్ : పోనిద్దూ సాయెబూ! పోనిద్దూ. యీళ్లెలాగైనా మనకి టోపీ యెట్టేత్తారు...బీమన్నా! యేదీ పాట లగాయించు.

పార్వతి : యెన్నడూ కడుపునిండా తిన్న పాపానబోలా. ముద్దముద్దా లెక్కెట్టుకుంటూ తినేదాన్ని. యేచనంలో యేం వొచ్చి పడుతుందోనని వొకటే ఘోసుకు...ఆయన కంటె యెక్కువ తింటానేమోనని అడిలిసచ్చేదాన్ని. యీ సీకిరిపీలికలు తప్పితే వొకనాడన్నా శుబ్బరమైన చీరంటూ యెరగ. నా ఖర్మమిలా యెందుకాలిందో?

దాసు : పాపం! విసిగిపోయావా? అంతా చక్కబడుతుందిలే అమ్మా...

యాక్టర్ : యేయ్, జాకీ యేసెయ్.

రాజా : రాజు!

గంగులు : యీళ్ళ తస్సాగొయ్యా! యెప్పుడూ యీళ్లదే గెలుపు!

సత్యం : అదేనోయ్, మా ఆనువాయితీ.

పోలయ్య : మేక!

భీమన్న : మేక! హుం.

పార్వతి : (ఆయాసంతో) యిక బతక...

గంగులు : ఊఁ – యిప్పట్టింలా – ఇక కట్టేయండి, కట్టేయండి. సాయబూ, నీకే సెప్పేది.

యాక్టర్ : ఆ మాత్రం వాళ్ళకి తెలీదా యేం ?

రాజా : గంగులూ ! యేం – తలపొగరెక్కిందా యేం – జాగర్త – వోళ్ళుతన్ను తన్నానంటే ఆ దేవలోకంలో కెళ్ళిపడాల్సిందే. జాగర్త.

సాహెబ్ : మల్లీ ముక్కాకి యేయండి భాయ్ ! ఆడుదాం. నిండా మున్గినోడికి సలీ హెకడ్డీ సెప్పూ భాయీ !

(గంగులు తలూపి భీమన్న దగ్గిరికి వెడతాడు)

పార్వతి : రామయ్య తండీ ! ఆ లోకంలోగూడా యీ నరక యాతన్లు తప్పవా యేం ? ఆ లోకంలో కూడా...

దాసు : ఆ లోకంలోనా ? ఆ లోకంలో యిలాంటి నరక యాతన లుండవమ్మా. అక్కడ ఆనందం తాండవిస్తుంటుంది. హాయిగా పడుకో. అంతా చక్కబడుతుందిలే. ఆ లోకంలో హాయిగా గడపొచ్చు. ఇంకా కాస్త వోపికపట్టమ్మా. ఈ ప్రపంచంలో ప్రతీ మనిషీ వోపికబట్టాలమ్మా, వోపిక బట్టాలి.

(లేచి వంటింటోకి గబగబా వెడతాడు)

భీమన్న : (పాట)

గల్లులా బాధలచేతా

జోగాయ్ : నలుగుతున్నాదీ దేహమూ

యెందుకైతే వుంచీనావి బందిఖానలో॥

సాహెబ్ : (బిగ్గరగా) దొంగా హాటాహాట్తావ్. సొక్కా సేతిలో ముక్కా దాస్తావ్ రే, భలే పెద్దామన్షివయా నీకీ !

రాజా : (కొంచెం గాబరాగా) యేం, యెక్కడ దాచమన్నా, నీ కళ్ళల్లోనా !

యాక్టర్ : నవాబ్జాదా ! మీరు ఖారబడ్డార్. ఇక్కడెవరికీ దొంగాటాడాలని లేదు

సాహెబ్ : హలాగేం ? మోషం, మోషం, మే మాండెదీ లేద్.

సత్యం : (పేకముక్కలు పోగుజేస్తూ) సరేపో – మేం మోసంసేస్తా మని తెల్సి యెందుకూ ఆటకురావటం సాయబూ ?

రాజా : యెటువ రెండణాలు పోయాయో లేదో యేందో కొంప గుండమైబోయినట్లు గోలెట్టేస్తున్నాడు. మళ్ళీనవాబట ! నవాబు !

సాహెబ్ : నిర్ఘాహితీ ఖావాలాభాయీ !

సత్యం : యెందుకేం?

సాహెబ్ : హెందూకూ?

సత్యం : నేనంది! 'యెందుకూ'అని

సాహెబ్ : మీకీ తెల్వాదాహేం ?

సత్యం : ఊహుఁ—నాకేం తెలీదు. నీకు తెలుసూ?

(కోపంతో ఉమ్మేస్తాడు. అంతా అతన్ని చూస్తూ నవ్వుతారు.)

జోగాయ్ : నీకేంపిచ్చా సాయబూ! యీళ్ళంతా నిజాయితీగా బతికితే మూడోరోజుకి మాడిమంగలమై సచ్చూరుకొంటారు. ఆమాత్రం తెలీదూ ?

సాహెబ్ : హాదంతా మాకీ హెందుకా. మద్సులూ నిర్ఘాహితీగా బతకావాలా.

జోగాయ్: మళ్లీ పాడిందే పాడరా పాసిపల్లదాసరి! భీమన్నా రా–టీ తాగొద్దాం. (పాట)

భీమన్న: (పాట) నల్లులా బాదలచేతా
నలుగుతున్నాదీ దేహమూ

జోగాయ్: రా, భాయీ, రా.

(పాడుతూ వెడతాడు. సాహెబ్ పిడికిలి సత్యంకేసి ఝూడించి వెడతాడు.

సత్యం: (నవ్వుతూ రాజాతో) మహారాజాధిరాజావారు నవ్వులో కాలేసారే. చగున్రకున్నారు, పెద్దమనుషులు, యెదవ పేకముక్క నగమానవుడి కంటబడకుండా దాసెయ్యలేక పోయారే — (నవ్వు)

రాజా: (బుజాలు ఎగరేస్తూ) అరె!

మాస్టర్: తెలివితేటలా పూజ్యం. ఇక స్వశక్తిమీద నమ్మకమా అంతకంటె పూజ్యం. ఇక డుమ్మీ తినక—

పోలయ్య: అరె! రెండుమేకలు కొట్టేసా!

భీమన్న: నిను కొట్టానికి ఓ మేకసాల్దా... ఊఁ–కానీ.

గంగులు: పోలయ్యా! ఇక లాబంతే. ఆట...

పోలయ్య: నోర్మూయొసే. పో. ఆతలికి పో.

సత్యం: గెలుపు ముందే! పదణాలు!

మాస్టర్: అందులోమూడణాలు నావంతురావాలి... అయితే నాకెందుకు యెధవ డబ్బు!

దాసు: (వంటింటోంచి వస్తూ) సాహెబుని తగిలేశేరా. ఇక దుకాణానికేనా ప్రయాణం!

రాజా: తాతా! నువుకూడా రద్దూ?

సత్యం: తప్పతాగితే యెలా వుంటావో సూడాలి తాతా!

దాసు : తెలివి తేటలు మరేం పదింతలు గావులే.

యాక్టర్ : తాతా! పద్యాలు చదివి విన్పించనా?

దాసు : యేవిటీ?

యాక్టర్ : కవిత్వం.

దాసు : కవిత్వం! యెందుకోయ్ కవిత్వం! యెధవ కవిత్వం! కూటికా, గుడ్డకా!

యాక్టర్ : ఆ-ఆ-అంతమాటే. కవిత్వంలో రసానందం, బ్రహ్మానందం....

సత్యం : యేయ్, మహాకవీ, వస్తావా, రావా!

(రాజాతో నిష్క్రమణ)

యాక్టర్ : వస్తున్నా-చిటికలో వచ్చి కలుసుకుంటా... తాతా! యీ పద్యం విను... (నుదురు రుద్దుకుంటూ) అరె! మొదలే గ్యాపకం రావడంలేదే!

భీమన్న : ఇద్గో నీ మేక... ఊఁ, కానీ.

పోలయ్య : ఛత్ - యెదవాట!

యాక్టర్ : పూర్వం - నాదేహం సారాతో విషంకాకముందు- నాకు మాంచిగ్యాపకశక్తుండేది ఇకిప్పుడునాపనై పోయింది. పూర్వం - ఆపద్యం చదువుతూంటే యేంచప్పట్లూ, యేం చప్పట్లూ,హాలంతాహోరెత్తిపోయేది. చప్పట్లంటేయేవిటో తెలుసా - సారామత్తు. స్టేజీమీాది కిలావచ్చి, యిలా నిల్చోని (పోజుపెట్టి నిముషం ఆగి తలగోక్కుటూ) అరె! ఒక్క ముక్కా గ్యాపకం రావడంలేదే! ఆ పద్యమంటె నాకెంతో యిష్టం...ఛా...

దాసు : అంత యిష్టమైన పద్యం యెలా మర్చిపోయావూ? ఆ పద్యంలో నీ మనసంతా లీనమైపోవాలి!

డాక్టర్ : మనసూ! మనసు యెప్పుడో మచ్చమాసిపోయింది. నా బతుకిలా చట్టుబండలైందెందుకో తెలుసా? నాలో నాకు నమ్మకం పోయీ... నా పనై పోయింది.

దాసు : మరేం పర్వాలేదు. చికిత్సవుంది. ఈరోజుల్లో తాగుడు మాన్తానికి చికిత్సచేస్తున్నారు తెలుసా? కానిడబ్బైనా పుచ్చుకోరు. ఉచితంగా చికిత్స చేయడానికి ఆస్పత్రిలాంటిది తెరిచారు. తాగుబోతూ మనిషేకదూ! – అందుకనీ మహాసంతోషంతో తాగుడురోగం కుదురుస్తున్నారు. అక్కడికి వెళ్ళరాదూ? ఊ – వెళ్ళు.

డాక్టర్ : (ఆలోచనాపూర్వకంగా) యెక్కడ? ఆ ఆస్పత్రి యెక్కడుందీ?

దాసు : అదా – అదోపట్నంలోవుంది. దానిపేరేమిటిచెప్మా... తమాషాపేరు...వర్వాలేదు. గ్నాపకంచేసుకు చెప్తా. ఈ లోపున ప్రయాణానికి సిద్ధంగా. సారా మానేసెయ్. మనసు నిబ్బరంచేసుకో...తర్వాత చికిత్సపొంది మళ్ళీ కొత్తబతుకు బదుకుదుగాని. బలేబాగుండదూ? కొత్త బతుకు...ఒక్కమాటు మనసులో నిశ్చయించుకో. అంతాచక్కబడుతుంది.

డాక్టర్ : (చిరునవ్వుతో) కొత్త బతుకు! మళ్ళీ మొదలు... బలేబాగుంది!...మళ్ళీ... (నవ్వు) నిశ్చయం చేసుకుంటా – చేసుకోలేనంటా?

దాసు : యెందుకు చేసుకోలేవు? తల్చుకుంటే యెంతపనైనా చెయ్యొచ్చు.

యాక్టర్ : (హఠాత్తుగా మేల్కొన్నవానిలా) నీబుర్ర శీలలు కొంచెం వదులైనట్టున్నాయేం ? తాతా! శెలవు. (ఈలవేసి) తాతా! శెలవు. (పోతాడు)

పార్వతి : తాతా !

దాసు : యేవిటమ్మా ?

పార్వతి : నాతో కాస్త మాటాడుదూ!

దాసు : (పార్వతి దగ్గిరికి వెళ్ళి) సరేలే, అమ్మా.

(గంగులు వీళ్ళని కనిపెడతాడు. నెమ్మదిగా భార్యదగ్గిరికి వెళ్ళి ఆమెకేసి చూస్తూ ఏదో చెప్పదలచినట్టు చేతులు కదుపుతాడు.)

దాసు : యేవిటి, తమ్ముడూ?

గంగులు : మరేంలా.

(నెమ్మదిగా తలుపు దగ్గిరికివెళ్ళి ఒక నిమిషం ఆగి వెళ్ళిపోతాడు.)

దాసు : (గంగులు వెళ్ళినవైపుచూస్తూ) పాపం ! నీ మొగుడు చాలా బాధపడుతున్నట్టున్నాడే !

పార్వతి : యిపుడాయన వూసెందుకు తాతా !

దాసు : నిన్ను కొట్టేవాడా ?

పార్వతి : సితకతన్నేవాడు. ఆయనమూలానే నేనిలా అర్చుకుపోయా.

భీమన్న : నా పెల్లానికో మిండడుండేవోడు. యెదవ ! పుల్లూదం బలే బాగా ఆడేవోడు.

పోలయ్య : ఆ—.

పార్వతి : తాతా ! సల్లటిమాటల్నాల్గు సెప్పు. వొంట్లో యేం బాగుండలా.

దాసు : చచ్చిపోయే ముందలానే వుంటుందమ్మా. అంతా చక్కబడు తుందిలే. బెంగెట్టుకోకు. ఇక కాసేపటికో కాస్సేపటికో చచ్చిపోతావ్. అప్పుడంతా హాయిగా, ప్రశాంతంగా వుంటుంది. ఇక యెవరికీ భయపడనక్కర్లా. నిశ్చింతగా పడుకో. హంసకాస్తా యెగిరి చక్కాబోతే అంతా నిర్మలంగా, నిశ్చింతగా వుంటుందంటారు. మన బోటి దిక్కుమాలిన వాళ్ళ పాలిటికి చావు మహాభాగ్యం. అందుకే పెద్దలేమన్నారో తెలుసా, నిశ్చింతగా కళ్ళు మూసుకోమన్నారు. అదే నిజమమ్మా! ఈ ప్రపంచంలో శాంతంటూ యెక్కడ దొరికేడుస్తుంది.

[గోపాలం ప్రవేశం తాగి. కంగారుగా, విచారంగావున్నాడు. బల్లమీద మెదలకుండా కూర్చుంటాడు.]

పార్వతి : ఆ లోకంలో - ఆడ యీ యాతన తప్పదా - తాతా!

దాసు : ఆ లోకంలో యిలాంటి బాధలేమీ వుండవమ్మా, యేమీవుండవు. నామాటనమ్మ. అక్కడంతా ప్రశాంతంగా, ఆనందంగా వుంటుంది. యమధర్మరాజు ముందుకు తీసికెళ్ళి 'మహాపతివ్రత పార్వతివచ్చింది' అని చెబుతారు.

పోలయ్య : (గట్టిగా) ఆడేంసెబుతారో నీకేంతెల్సు. నువ్వు వినొచ్చావేం? బలే తమాసా సేత్తున్నావే!

(పోలయ్య గొంతువిని గోపాలం తలెత్తివింటుంటాడు.)

దాసు : నేనుచెప్పానంటే నాకుతెలుసన్నమాట, హెడ్డూ!

పోలయ్య : (స్నేహపూర్వకంగా) కావొచ్చు. పోసీ అదంతా నాకెందుకేం. మరి - నే యెడ్డునుగానే?

భీమన్న : ఏమోచనో _ ఏమోచను.

పోలయ్య : వోరినా... ?

దాసు : యమధర్మరాజు నీకేసియెంతో దయతో చూసి "పార్వతి మహాదొడ్డయిల్లాలు సరాసరిస్వర్గానికి తీసికెళ్లి పంచభక్ష్య పరమాన్నాలతో భోజనంపెట్టి మాంచికోకారై కాకట్టబెట్టి హంసతూలికా తల్పంమీద పడుకోబెట్టండి. పాపం! భూలోకంలో మహాకష్టా లనుభవించింది" అంటాడు.

పార్వతి : తాతా! తాతా! అలాజరిగితేనా! ఆలాజరిగితేనా! సీకూ సింతా లేకుండా ఆయిగ వుంటేనా!

దాసు : చీకూ వుండదు, చింతా వుండదు. నా మాట నమ్మమ్మా. ఇక సంతోషంగా చచ్చిపో. భయపడకు. చావుందే, చావు-చంటిపిల్లలపాలిటి తల్లిలాంటిది-బెంగెట్టు కోకమ్మా.

పార్వతి : యేమో, బతుకుతానేమో తాతా!

దాసు : (నవ్వి) యెందుకూ బతకటం! మళ్ళీ యీ నరక యాతన లనుభవిస్తానికేనా?

పార్వతి : బతికితే...ఇంకా కాసిన్ని రోజులు ... ఆ లోకంలో బాదలంటూ వుండవన్నావుగా. యీ లోకంలో వోర్చుకుంటాలే.

దాసు : అక్కడేం వుండవమ్మా ఒక్క...

గోపాలం : (లేచి) నీ మాటలు నిజమో అబద్ధమో యెవరికి తెల్సు?

పార్వతి : (అదిరిపడి) అయ్యో దేముడా!

దాసు : యేమిటబ్బాయీ, యిదంతా!

పోలయ్యా : వోరా కేకలేసేది ?

గోపాలం : (దగ్గిరికివెళ్ళి) నేనూ ! యేం ?

పోలయ్యా : యెందుకా కేకలు. నోర్మూసుకు పడుండక—

గోపాలం : వోరిదద్దమ్మా - ఒహూ వాళ్ళమామయ్యావా !

దాసు : యేవిటా కేకలు ? ఆపేయండి. విన్పించడంలా ? హంస లేచిపోతోంది. అప్పుడే చావుకళపడింది. కన్పించడంలా, గోల్జేయకండి.

గోపాలం : బలే తమాషామనిషివి తాతా ! ఊ - అబద్ధాలాట్టంలో మొనగాడివి. నీ కట్టుకథలు వింటానికి బలే మజాగా వుంటాయ్. ఊ - కాని అబద్ధాలో సుబద్ధాలో దంచెయ్. ఈ ప్రపంచకంలో వినదగిందేముంది ?

భీమన్న : నిజంగా పాణం పోతోందా ?

దాసు : నాకేం ఆశ కన్పించడంలా.

భీమన్న : పీడా వదుల్తుంది దాని దగ్గుతో మద్దె మేం సత్తున్నాం. ఈ లోకాన్నుంచి ఆ లోకానికి పమోచనో పమోచను.

పోలయ్యా : ఆరి నీ పిండంబెట్ట !

గోపాలం : వారేయ్ !

పోలయ్యా : ఊ - వారేయ్ ?

గోపాలం : పోలయ్యా విమలకి జబ్బుగావుందా ?

పోలయ్యా : నీకెందుకేం ?

గోపాలం : పర్వాలేదు, చెప్పూ. కమలకొట్టిందా ?

పోలయ్యా : నీకెందుకేం ఆ గొడవ. యెదో కుటుంబ యవారం. మద్దె నువ్వోడివి ?

గోపాలం : నేనెవర్నైతేనేం ! తల్చుకున్నా నా విమల్ని నీకంట బడకుండా చేయగల్ను. తెల్సిందా ?

పోలయ్య : (ప్రల్హాదం తీసేసి) యేటంటున్నా ? వోర్నిగురించీ కారుకూతలు కూత్తుంట ! మా మేనగోడల్ని గురించా ! దొంగెదవా ?

గోపాలం : నేను దొంగను కావొచ్చు. కాని నువు పట్టుకేడిస్తేగా.

పోలయ్య : కొత్త తమాయించు. పట్టుకు సూపిత్తానో లేదో తొందర్లోనే...

గోపాలం : నను పట్టుకుంటే – మీ అందరికొంపా తీకుండా నోర్మూసుకొని కూచుంటాననుకున్నా ? నాకసి తీర్చుకుంటా. కోర్టులో "నీకు దొంగతనం నేర్పిందెవరు ? చెయ్యమందెవరు ?" అని అడిగితే కొండయ్య, ఆడిపెళ్లాం అని చెప్పేస్తా. "దొంగసొమ్మెం జేశా ? అని అడిగితే "కొండయ్యకీ వాడి పెళ్ళానికి యిచ్చా" అని చెబుతా.

పోలయ్య : నువ్వొత్తి అబద్దాలకోరువి, నీ మాట లెవర్నమ్ముతారు ?

గోపాలం : నేజెప్పేదినిజంకాబట్టే నమ్ముతారు. నిన్నుమాత్రం వదల్తాననుకున్నా ! నిన్నూ కోర్టుకీడుస్తా. హహహా... ... మిమ్మందర్నీ నాశనంచేసి మరీ వదుల్తా. రాక్షసేధవల్లారా! చూద్దురుగాని...

పోలయ్య : (భయంతో) వోరి, అబద్దాలకోరా, నీకేం అపకారం సేశారా, పిచ్చికుక్కల్లే నా యెంటడ్డావ్.

గోపాలం : ఇంతవరదాకా నాకేం వుపకారం చేశావో చెప్పు?

దాసు : ఊఁ___

పోలయ్య : (దాసుతో) యేంటి మా గొణుగుతున్నా! నీకెందుకేం మాగొడవ. అదేదో కుటుంబయవాడం.

భీమన్న : (దాసుతో) దాసూ! నీకెందుకేం ఆగొడవ. ఆ వుచ్చు నీకోసం, నాకోసం గాదులే.

దాసు : (మెల్లగా) నాకెందుకీ యెధవగొడవ. యేంలే - 'ఉపకారం చేయకపోవడమే, అపకారం చేసినట్టు' అని చెప్పొచ్చా. అంతే___

పోలయ్య : హుఁ-యీాడ వొకళ్ళసంగతొకళ్ళకి బాగా తెలుసు. మద్దె నువ్వోడివి? (కోపంతో వెడతాడు)

దాసు : ఒహో! దొరగారికి కోపంవచ్చినట్టుంది! అరరే... చూస్తున్నాగా ... మీా వ్యవహారాలు మహాచిక్కుల్లో పడ్డట్టున్నయ్యే?

గోపాలం : కమలకి పురెక్కించడానికెళ్ళాడు దొర!

భీమన్న : తెలివితక్కువ, ఆకలెక్కువ. ధైర్యం వొలకోస్తున్నావ్‌గాని - జాగ్రత. యిదేనా సమయం... యిదేం అల్లాటప్పా యవాడమనుకున్నా. వొక్క చనంలో నీ బుర్రకి రాంకీరతన వడతారు. జాగ్రత...

గోపాలం : యేడిచారు. నాముందా వీళ్ళ కుప్పిగంతులు? పోట్లాడాలని వాళ్ళకుంటే నేనూ తయార్.

దాసు : అబ్బాయీ! ఇక్కడనుంచి మెల్లిగా తప్పుకు చక్కాబోవడం మంచిదిగదూ - అయినా ఆలోచించిచూడు.

గోపాలం: యెక్కడికి పొమ్మంటా? పోనీ యెక్కడికో చెప్పా.

దాసు: అండమాన్లకి.

గోపాలం: ఉహూఁ దమ్మిడీ కర్చులేకుండా నన్నక్కడికి పంపే క్షణంకోసం కాచుకు కూచున్నా.

దాసు: నామాటవిని అక్కడికి చక్కాపో. అక్కడ నీకు సవ్యమైన దోవ దొరుకుతుంది. నీలాంటివాళ్ళ అవసరం అక్కడ చాలా వుంది.

గోపాలం: నాకు దోవ యెన్నడో దొరికింది. మా నాన్న బతుకంతా జైల్లోనే గడిచిపోయింది. ఆ దోవనే నన్నూ నడవమన్నాడు...చిన్నప్పటినుంచీ నన్ను 'దొంగ యెదవ' అని తిడుతూనే వున్నారు.

దాసు: అండమాన్లు మహామంచి ప్రదేశం నాయనా! బంగారం పండుతుంది. వొంటో సత్తువుండి తిన్నగా నడుచుకుంటే అదృష్టం గిర్రున తిరుగుతుంది.

గోపాలం: యెందుకీ అబద్ధాలు తాతా?

దాసు: యేవిటీ?

గోపాలం: యేం చెముడా? యెందుకూ యిలా అబద్ధాలాట్టం?

దాసు: నే చెప్పేదంతా అబద్ధమేనంటా?

గోపాలం: అంతా పచ్చిఅబద్ధం. అరిచేతిలో వైకుంఠం చూపుతున్నా వెందుకేం?

దాసు: నా మాట నమ్మి అక్కడికెళ్ళి చూడు. నా పేరు తల్చుకుని దండం పెడతావో లేదో! కాకపోయినా –

యెందుకూ యీ మార్గు పట్టుకు వేలాట్టం? నిజం కోసరం యెందు కింత ఆదుర్దా? ఆలోచించుకో. చివరికి నిజం నీ మెడమీది కత్తిగా తయారవుతుంది.

గోపాలం: ఊఁ – కానీ, మెడమీది కత్తిగా తయారుగానీ. యెదైనా సరే నాకేం దిగుల్లేదు,

దాసు: పిచ్చాడా! చేతులారా యెవరైనా చావు తెచ్చుకుంటారా చెప్పు?

భీమన్న: యేంది వాదులాట! గోపాళం! నిజంకావాలా? యెందుకేం? నీకు తెలీదేం పాపం!... లోకమంతా కోడై కూత్తుంటే!

గోపాలం: చాల్చాల్లే వాగుడు. జవాబుచెప్పమను సూద్దాం ...తాతా చెప్పు – దేముడున్నాడా?

(దాసు నవ్వి ఊరుకుంటాడు)

భీమన్న: మడుచులు బతుకు చాగిత్తూనే వుంటారు. పేక ముక్కల్తో మేడలు కట్టుకుంటారు. ఆపేక మేడలు అమాంతం కూలిపోతాయ్.

గోపాలం: సరే – దేముడున్నాడా? ఊఁ – చెప్పూ?

దాసు: (నెమ్మదిగా) ఉన్నాడనుకుంటే ఉన్నాడు. లేడనుకుంటే లేడు. నీ నమ్మకంలో వుందంతా...

(గోపాలం దాసువంక రెప్పవాల్చకుండా ఆశ్చర్యంతో చూస్తాడు)

భీమన్న: టీ కేడుతున్నా. యింకోరైనా వత్తారా?

దాసు: (గోపాలంతో) యేవిటలా తేరిపారజూస్తున్నా?

గోపాలం: యేంలే... విను... నువుచెప్పేది...

భీమన్న : పోనీ నేనొక్కణ్ణే పోతా.

(తలుపుదగ్గిరికి వెళ్ళేసరికి కమల ఎదురవుతుంది.)

గోపాలం : అంటే - నువ్వు జెప్పేది...

కమల : (భీమన్నతో) రాధ లోపలుందా ?

భీమన్న : లేదు. (వెళ్ళిపోతాడు)

గోపాలం : సరె - తయారైందీ !...

కమల : (పార్వతి దగ్గరికి వెళ్ళి) ఇంకా ప్రాణాలతోనే వున్నా ?

దాసు : మాటాడించకు.

కమల : యిక్కడేంచేస్తున్నా ?

దాసు : పొమ్మంటే లేచ్చక్కా పోతా.

కమల : (గోపాలం గదిదగ్గిరికి వెళ్ళి) గోపాలం నీతో కొంచెం మాటాడాల్సిన పనుం దిలారా.

(దాసు బయటికి వెళ్ళిపోయినట్టు నటించి వెళ్ళి తిన్నెకింద దాక్కుంటాడు.)

కమల : గోపాలం యిలా వోమాటురా.

గోపాలం : ఉహుఁ - నేరాను...

కమల : ఊఁ-రావ్వూ ? యేమొచ్చిందేం రోగం !

గోపాలం : అబ్బబ్బా! యీ గొడవతో నాకు మొహంమొత్తిపోయింది. నన్నింక చంపకు.

కమల : నేనంటేకూడా మొహం మొత్తిందా ?

గోపాలం : ఆ-నువ్వన్నా !

(కమల పార్వతిపక్కదగ్గిరికి వెళ్ళి అటూ యిటూ జాగ్రత్తగా పరిశీలించి తిరిగి వస్తుంది)

గోపాలం : సరె - ఆట్టే చంపక, నువ్వు చెప్పదలుచుకుందేమిటో త్వరగా చెప్పు.

కమల : చెప్పడానికేముంది గోపాలం! నన్ను ప్రేమించమని నిన్ను బలవంతబెట్టబోను. పైగా దయాధర్మబిచ్చమంటే నాకు తలనొప్పి... నిజం కక్కేశావ్. అంతేచాలు ...

గోపాలం : యేం నిజం ?

కమల : యేం నిజమా ? నేనంటే మొహం మొత్తింది, నిజమా, అబద్ధమా ?

(గోపాలం మెదలకుండా ఆమెకేసి చూస్తాడు)

కమల : (గోపాలం దగ్గరికి వెళ్ళి) యేవిటలా చూస్తున్నావ్ ? నే నెవర్నో గుర్తుపట్టలేక పోతున్నావా ?

గోపాలం : (నిట్టూర్చి) నువ్వు మాంచి అందకత్తెవే, కమలా ? (కమల గోపాలం బుజంమీద చెయివేస్తుంది. గోపాలం కమల చెయ్యి తోసేసి) కాని నా మనసు కెక్కలేక పోయావ్. సీతో, యింకెందరితోనో కాలక్షేపం జేసా. అయినా నువ్వంటే నా కెన్నడూ ప్రేమలేదు.

కమల : (నిట్టూర్చి) చివరికిదా... సరే...

గోపాలం : ఇక మాట్లాట్టానికేముంది ? పో – అవతలికి పో.

కమల : యింకెవరిమీదన్నా కన్నేశావా యేం ?

గోపాలం : నీ కెందుకదంతా ? కన్నేసినా నిన్నేం తొర్చమన్నులే.

కమల : హుఁ– అయినా–ఆ కాస్త సాయం జేసి దాన్ని...

గోపాలం : దేన్ని ?

కమల : దేన్నా ! పాపం ! నీకు తెలీదేం ? మొండుకీ టక్కులు. గోపాలం! నేను ముక్కుకుసూటిగా పోయేదాన్ని.

వృత్తికి పుణ్యానికి చెప్పొచ్చుకొట్టినంత పని జేశావ్. నన్నెంతో ప్రేమించానన్నావ్... యిపుడమాంతంగా...

గోపాలం: అమాంతంగా యేంగాదులే! చాలారోజుల్నించి.. నీకు హృదయమంటూ లేదు. ఆడదానికి హృదయముండాలి. మేం మొగాళ్ళం. వొట్టి పశువులం. మమ్మల్ని సంబాళించుకోవాలి... నీవేం సంబాళించుకున్నా ?

కమల: అయిందేమిటో అయిపోయింది... మనిషికి పూర్తిగా స్వేచ్ఛ వుండదని నాకూ తెల్సు. నామీద ప్రేమ మాసిపోతే - సరే. యేంజేస్తాం.

గోపాలం: యిక తెగతెంపులే కదూ–గొడవాగట్రా లేకుండా మంచిది.

కమల: ఊహుం - ఒక్కక్షణం ఆగు... నీతో కాలంగడిపిన రోజుల్లో యీ గొడిబండనించి నను తప్పిస్తావనుకున్నా. నా మొగణ్ణుంచీ, మా మామనించీ, యీ పాడుబతుకునించీ తప్పించి, ఉద్ధరిస్తావనుకున్నా. బవుశా - నీకంటే యీ ఆశనే యెక్కువ ప్రేమిస్తున్నానేమో, తెలిసిందా ? నన్నేమో ఈ చెరనించి వదిలిస్తావని కాసుకు కూచున్నా.

గోపాలం: వదిలిస్తానికి నీవేం మేకువా, నేనేం పట్కార్నా ? ఎదో అందంగా వున్నావ్... తెలివిగలదానివి... అనే అనుకున్నా సుమా.

కమల: (దగ్గిరగా వంగి) గోపాలం! రా, ఒకళ్ళకొకళ్ళం సహాయం చేసుకుందాం.

గోపాలం: యెలా ?

కమల : మా చెల్లి - నాకు తెల్సులే... అదంటే పడి చస్తు న్నావుగదూ !...

గోపాలం : అందుకా దాన్ని చితక్కొట్టింది ? కమలా ! జాగ్రత్త దాన్జోలికి వెళ్ళావో...!

కమల : ఆగు ... యెందుకలా మండిపడతా. పిచ్చిపిచ్చి వేషాలేయక, మనలోమనం అన్ని ఏర్పాట్లు చేసు కుందాం. పోనీ దాన్ని కట్టుకో. నువ్వు కోరినంత డబ్బిస్తా.

గోపాలం : (దూరంగా జరిగి) యేవిటీ ? యెందుకీ గొడవంతా ?

కమల : ఆ మొగుడుముండాకొడుకి బారినించి నను తప్పించు గోపాలం ! ఈ గుదిబండ వదిలిద్దూ !

గోపాలం : (మెల్లిగా ఈలవేస్తూ) అదా సంగతీ ఒహో ! బలే యెత్తేశావే ? కాట్లో మొగుడు - జైల్లో రంకుమొగుడు ! యిక నువ్వూ...

కమల : గోపాలం ! జైల్లో యేవిటి ? నిన్నే స్వయంగా చెయి చేసుకోమన్నానా ? యెవడినన్నా బనాయించు. స్వయంగా నువ్వే చేస్తేమటుకు యెవడికి తెలిసేడుస్తుంది... ఆలోచించుకో. విమలా, డబ్బూ, రెండూ దక్కుతాయ్. యెక్కడికైనా దూరదేశంలేచి పొండి. బతికినంత కాలం నాకు స్వేచ్ఛ లభిస్తుంది. యిక మా చెల్లి విషయం — దాన్నిచూస్తే నాకళ్ళలో సూదులుగుచ్చుకున్నట్టుంటుంది. నీమూలాన అడంటే నాకు అరికాలిమంట నెత్తికెక్కు తోంది. వాళ్ళు తెలీదు. రంపకోత కోస్తాను. చిదక్కొడ తాను. దానికి తగిల్న దెబ్బలుచూస్తే ఒకొక్కప్పుడు

నాకే యేడుపొస్తుంది. అయినా కొట్టాను ... చావగొడు తూనే వుంటా.

గోపాలం : వొట్టి పశువ్వి. పైగా అదేదో గొప్పగా చెప్పుకుంటున్నా.

కమల : గొప్పేంటి నా బొంద, నిజం చెప్పా. అంతే... ఆలోచించుకో, గోపాలం! నా మొగుడిమూలంగా-ఆడి దురాశ మూలంగా, రెండుసార్లు నిను జైల్లో యేశారు. నాల్గేళ్ళనించి జలగలా నా నెత్తురు పీల్చేస్తున్నాడు. యేం మొగుడు చట్టుబండలు! విమలని ముస్లిదాన్నిలా తరిమేస్తున్నాడు. విషప్పురుగు!

గోపాలం : బలే బలే జిత్తులు తెల్సే నీకు!

కమల : అంతా స్పష్టంగా చెప్పేశా. యిక నా యెత్తైవిటో తెల్సుకో లేకపోతే నువు వొట్టి దద్దమ్మవన్నమాటే.

[కొండయ్య నిశ్శబ్దంగా ప్రవేశించి మెల్లిగా ముందుకు వస్తాడు]

గోపాలం : (కమలతో) పో, వెళ్ళిపో.

కమల : బాగా ఆలోచించుకో. (భర్తనుచూచి) యేం కావాలేం? నా కోసమేనా ?

(గోపాలం అదిరిపోయి కొండయ్యకేసి చూస్తాడు)

కొండయ్య : నేనే- నేనే. మీరాయిద్దరూ-యిక్కడ వొంటిరిగా ఊఁ-మాటాడుకుంటున్నారేం - (అమాంతం నేలతన్ని) నిన్నరికెయ్య ... తప్పొదుముండా! (జవాబు లేకపోయేసరికి భయపడి) భగవాన్-చమించు. బుద్ధి, బుద్ధి. మల్లీ నాసేత పాపాలు సేయించడానికి దారిదీస్తున్నా? కమలా! నీ కోసం

యిల్లంతా యెతుకుతున్నా. నిదరబోయే యేశైంది. దీపారాదనలో నూనోయడం మర్సేబోయా? పెంట ముండా!– భడివా!

[వణికేచేతుల్తో కమలను బెదిరిస్తాడు. కమల మెల్లిగా వెనుతూ గోపాలంకేసి చూస్తుంది.]

గోపాలం: (కొండయ్యని) ఫో–అవతలకి ఫో. ఊ–నడూ ముందు.

కొండయ్య: (బిగ్గరగా) యీ యింటికొక్కమందున్నేను. దొంగ ముండాకొడక, నువ్వే అవతలికి ఫో–

గోపాలం: (కోపంతో) ఫో–అవతలకి ఫో–యిదిగో చెబుతున్నా కొండయ్యా!

కొండయ్య: యేం–ఊ – సెయ్యెత్తు సూద్దాం. నా తడాకా సూపిత్త.

[గోపాలం కొండయ్య గొంతుపట్టుకుని ఊపుతాడు. హఠాత్తుగా పెద్దపెట్టున ఏడ్పువినిపిస్తుంది. గోపాలం కొండయ్యని వదులుతాడు. కొండయ్య ఏడుస్తూ పరుగెత్తుతాడు.]

గోపాలం: యెవరక్కడ?

దాసు: (తలయివతలికిపెట్టి) ఆ–

గోపాల: నువ్వా? రా–బయటికిరా.

(దాసు యివతలికి వస్తాడు.)

దాసు: యిదిగో వచ్చే–

గోపాలం: (కఠినంగా) తిన్నెకింద పడుకున్నా వెందుకేం?

దాసు: మరెక్కడ పడుకోవాలేం?

గోపాలం: బయటికెళ్ళినట్టున్నా వే?

దాసు : బైటచలోస్తోంది !

గోపాలం : ఊ-యేమన్నా విన్పించిందా ?

దాసు : ఆ-విన్పించింది. చెవిటిమొద్దుననుకున్నా? చెవుల్లో వాొచ్చిపడుతుంటే-బలే! బలే అదృష్టవంతుడివి.

గోపాలం : యేవిటా అదృష్టం?

దాసు : నేను తిన్నెకింద పడుకోవడమే !

గోపాలం : మరి అట్టా అరిచావేం ?

దాసు : వుక్క-బోసి, వుక్కి-రి బిక్కి-రయ్యా. అంతే... అందుకు నువ్వు నాకాళ్ళకి మొక్కా-లి...వాొళ్ళు తెలీక వాడిప్రాణం నిలువునా తీసేవాడవేనా! నాకంటబడ్డం-అదే నీ అదృష్టం.

గోపాలం : ఆ-నిలువునా చీల్చేసేవాణ్ణి. యెధవ...

దాసు : ప్రాణందీయడం యెంతసేవ్వూ, ఒక్క-క్షణం. వాొళ్ళు తెలీక చాలామంది యిలాగే అడుసులో కాలేస్తారు.

గోపాలం : (చిరునవ్వుతో) నువ్వూ యిదివర కిలానే అడుసులో కాలేసావా యేం ?

దాసు : విన్నాయనా, నా మాటవిను. ఆ రాక్షసి కెంత దూరంగా వుంటే అంత మంచిది. దాన్ని వదిల్చేసుకో, వదిల్చేసుకో, వదిల్చేసుకో. నీ సాయం వున్నా లేకపోయినా అది మొగుణ్ణి యీ లోకంనించి తరిమేస్తుంది. ఆ రాక్షసి మాట వినబోకు. నాకేసి చూడు. బట్టతల ... ఎందు కయిందో తెలుసా. ఆడాళ్ళని ... నా తలమీద పూర్వ మున్న వెంట్రుకలకంటె యెక్కు-వమంది ఆడాళ్ళనేచూచా-కాని యీ కమలంత బ్రహ్మరాక్షసి నెక్క-డా చూడలా.

గోపాలం: నీకు దండమే పెట్టాలో, మరేమనాలో తోచ డంలా.

దాసు: యేమీ అనద్దు. ఇప్పుడు నే చెప్పిన మాటలంత మంచిమాటలు నీ జన్మలో వినవ్. నామాట విను. నువ్వు ప్రేమించిన ఆ పిల్లని చంకనేసుకుని వెనక్కి తిరిగి చూడ కుండా వుడాయించు. ఇక్కణ్ణుంచి వుడాయించు. ఇక్కడి నించి యెంతదూరం పోతే అంత మంచిది.

గోపాలం: మంచాళ్ళెవరో, చెడ్డాళ్ళెవరో నువవంటే యిట్టే పసిగట్టేస్తావ్ గాని నాకుమట్టుకు నాకు తెల్సుకోటం మహా కష్టం...

దాసు: యిందులో యేవంత కష్టముందేం? మనిషి యెప్పుడూ వోమాదిరిగానే వుంటాడనుకున్నా? మనసును తిప్పుకో డంలో వుంది. యివాళ మంచి, రేపు చెడ్డ. ఆ పిల్ల నీ మనసు కాజేసిందో, ఊఁ–ఆ పిల్లని తీసుకు వుడాయించు. లేదూ, ఒక్కడివే వుడాయించు. పడుచువాడివి. యెప్పటి కైనా యింకో పిల్లని నీవల్లో వేసుకోవచ్చు.

గోపాలం: (దాసు బుజాలు పట్టుకుని) నిజం చెప్పు. యిదంతా నాకెందుకు చెబుతున్నావ్?

దాసు: ఒక్కక్షణం ఆగు... వదులు... పార్వతి యెలావుందో చూస్తాను. ఆయాస పడుతున్నట్టుంది... [పార్వతి పక్కదగ్గ రికివెళ్లి నాడిచూస్తాడు. గోపాలం ఆందోళనతో ఆలోచనతో కనిబెడు తుంటాడు.] భగవాన్! క్షమాపాళో! యీ జీవాత్మను నీలో ఐక్యంచేసుకో! నారాయణా! నారాయణా!

గోపాలం : (నిట్టూర్చి) అయిపోయిందా యేం?.

(ముందువంగి పక్కకేసి చూస్తాడు.)

దాసు : (నెమ్మదిగా) ఆ- పార్వతి కష్టాలు గట్టెక్కేయ్... గంగులేడీ?

గోపాలం : బవుశా, సారాదుకాణంలో వున్నాడనుకుంటా.

దాసు : వెళ్ళి చెప్పిరావడం మంచిది.

గోపాలం : (భయంతో) నాకు పీనుగలంటే మా చెడ్డరోత.

దాసు : (వెడుతూ) రోతగాక మక్కువ వుంటానికేముంది? బతికున్నాళ్ళమీద మక్కువుండాలి... బతికున్నాళ్ళమీద...

గోపాలం : నేనూవస్తా...

దాసు : యేం భయమా?

గోపాలం : రోత!

[తొందరగా వెళ్ళిపోతాడు - స్టేజీ నిర్మానుష్యం, నిశ్శబ్దం. అనిర్దిష్ట ధ్వనులు గుమ్మం అవతలనుంచి విన్పిస్తాయ్. యాక్టర్ ప్రవేశం]

యాక్టర్ : (తలుపు మూయకుండా గుమ్మంలో ద్వారబంధానికి ఆనుకుని బిగ్గరగా) యేయ్ తాతా! ఎక్కడున్నా? ఆ పద్యం గ్నాపక మొచ్చింది. విను... (రెండడుగులు ముందుకువేసి పోజుపట్టి)

"కాబోలు బ్రహ్మరక్షస్సమూహం బిది
ఘోషించుచుండె బుక్కుల క్రమంబు
కాబోలు వీరు విగతజీవబాంధవు
లడరుచుండిరి మహార్తారవముల
గాబోలు వీరు టక్కరి భూతమాంత్రికుల్
వెదకుచుండిరి కపాలములకొరకు
కాబోలు నిది పిశాచీ బాంధవశ్రేణి
పలలంపు బువ్వంపు బంతిసాగ

చిట్లుచున్నవి కాజోలు చితులలోన
గాల్పబడెడు శవాలకం కాళసమితి
నెట బెకీలను రవముతో యొసగుచుండు
దిక్కులన్నిండ మార్మ్రోత పిక్కటిల్ల."

విమల : (నవ్వుతూ) యేయ్ పిచ్చికూనా!

యాక్టర్ : (విమలకేసి తిరిగి) ఆ - నువా? ఆ ముసిలాడెడీ? మహామంచివాడు. ఇక్కడెవరూ వున్నట్టులేదే! శెలవు - విమాలా! శెలవు.

విమల : (ప్రవేశించి) వొచ్చి క్షణమైందో లేదో, అప్పుడే వెళ్ళి పోతున్నావేం?

యాక్టర్ : (అడ్డం తగిలి) నే వెళ్ళిపోతున్నా - వెళ్ళిపోతున్నా. నాజీవితంలో వసంతకాలం వొస్తుంది... ఇక నేనుండేదిలేదు.

విమల : నను పోనీ, అయినా ఎక్కడికెడుతున్నా?

యాక్టర్ : ఆ మహానగరం అన్వేషించేందుకు, చికిత్సపొందేందుకూ. చిత్రాంగీ! నువ్వూ యీ పాడు కొంప వదిలేసి యే మఠాన్నో ఆశ్రయించు. సురాపాన పెనుభూతాన్ని వదిలించే చికిత్సాలయముందిట. ఓ-దేవేంద్రభవనం-చలువ రాళ్ళు - నేలంతా చలవరాళ్ళ మయం! యెలక్ట్రిదీపాలు! మాంచి భోజనం - శుభ్రమైన గదులూ. అంతా ఒక్క చిల్లిగవ్వయినా కర్చుపెట్టకుండా నే సమకూరుతాయ్. నేలంతా చలవరాళ్ళు! వెతికి వెతికి పట్టుకుని - చికిత్స పొందుతా - పునర్జన్మ... విమాలా! నేను వేషాలు వేసే రోజుల్లో నాకు నటరాజు అనే బిరుదుండేది. ఇక్కడెవరికీ ఆ విషయం తెలీదు. ఇక్కడ నాకు వూరూ లేదు పేరూ లేదు.

నా పేరు మాసిపోయిందంటే నాకెంత కష్టంగావుంటుందో ఆలోచించు. ఈరోజులలో కుక్కలకికూడా పేర్లున్నాయ్.

(విమల యాక్టరుచుట్టూ తిరిగి పార్వతి మంచం దగ్గిరికి వెళ్ళి చూస్తుంటుంది)

యాక్టర్ : వూరూలేదు, పేరూలేదు... ఇంక మనిషేమిటి?

విమల : చూడు... పార్వతి, పాపం! చచ్చిపోయినట్టుంది.

యాక్టర్ : చచ్చిపోవడమే!

విమల : (అడుగు వెనక్కివేసి) నిజం! చూడు.

భీమన్న : (గుమ్మంలోంచి) యేవిటె నూసేది?

విమల : పార్వతిని. పాపం! చచ్చిపోయింది.

భీమన్న : పాడు దగ్గు అణిగిపోయిందన్నమాట. (పార్వతి పక్కదాకా వెళ్ళి, చూచి, తన తిన్నెమీదకివెళ్ళి కూర్చుంటాడు) గంగులు కిది చెప్పాలి. అది ఆడిగోడవ.

యాక్టర్ : పాపం! వూరూపేరూలేకుండాపోయింది. గంగుల్ని నే పిల్చుకొస్తానుండు. (వెడతాడు)

విమల : (గదిమధ్య నిలబడి) నాగతీ - యెప్పుడో ఒకప్పుడు - యిలానే పడుతుందేమో!...ఏ పెంటకుప్పమీదికి తోసేస్తారో... యే పెంటకుప్పమీదకి...

భీమన్న : (తన తిన్నెమీద పాతగుడ్డ సరుచుకొని) యేందీ? యేంది గొనుగుతున్నా?

విమల : యెదో నాలో నేను......

భీమన్న : గోపాళంకోసమా - ఇదిగో జాగర్త. ఆ గోపాళంగాడి మూలకంగా నీ తలెగిరిపోతుద్ది. జాగర్త.

విమల : యెవరిమూలకంగా నైతేనేం? కానీ - వాడేనయం!

భీమన్న : (పడుకుంటూ) నాకెందుకేం మీగోడవ. యోలాగైనా సావండి.

విమల : పార్వతి అదృష్టవంతురాలు! వెళ్ళిపోయింది. పాపం! ...మనిషి బతకడం యెందుకూ ?

భీమన్న : పుట్టటం, పెరగటం, సావటం ! అందరి బతుకూ యింతే. యెపుడో వొకప్పుడు నేనూ సచ్చిపోతా, నువ్వూ సచ్చిపోతావ్. ఇక పాపం యేంటి?

[దాసు, సాహెబు, జోగాయ్, గంగులు ప్రవేశం. ఆఖరున గంగులు ఆందోళనతో]

విమల : పాపం! పార్వతి...

జోగాయ్ : యిన్నాం. పాపం! మా దొడ్డయిల్లాలు. సారగాని కెడుతుంది లే.

సాహెబ్ : హావతల్కి తీస్కవెళ్లావాలా. తీస్కవెళ్లావాలా. హీండ చవాల్నుంచుతార్ ! హీకస భత్కి హున్నావాళ్లే నిదర్ పోవాలా.

గంగులు : (మందస్వరంతో) తీసుకు వెడతాంలే...

[అంతా పార్వతి పక్కదగ్గరకి వెడతారు. గంగులు తక్కిన వాళ్ల బుజాల మీదుగా చూస్తాడు.]

జోగాయ్ : (సాహెబ్‌తో) వోసన గొడుతుందంటా! వోసనా లేదు, గీసనాలేదు. బతికుండగానే యెండిపోయింది.

విమల : రామ, రామ! కాస్త జాలన్నా లేదట్రా! 'పాపం' అని ఒక్క ముక్కన్నా... నోరడి పోయిందా ! బతేజట్లు!

దాసు : కోప్పడకమ్మా – వర్వాలేదులే – చచ్చిన వాళ్ళమీద జాలిపడతామని యెలాఅనుకున్నా. బతుకున్న వాళ్ళమీదే మనకి జాలేదాయె... మనమీదే మనకి జాల్లేదాయె... ఇక చచ్చిపోయిన వాళ్లమీదా ... పిచ్చిపిల్లా!

భీమన్న : (ఆవలిస్తూ) మాటల్తో సావుని తరిమేస్తావా?...రోగం ...రోగాన్ని తరిమేయగలం! సావునా!
సాహెబ్ : (దూరంగా జరుగుతూ) సర్కారుకు బోలో భాయ్!
జోగాయ్ : ఔనౌను. గంగులూ! మునిచపలోళ్ళకి సెప్పిరా.
గంగులు : ఊహుఁ—మునిచపలోళ్ళకి సెబితే కాటికాడ సుంకం యిమ్మంటారు. నాకాడ పైసన్నా లేదు.
జోగాయ్ : అలా అయితే అప్పుచ్చుకో...ఊఁ - పోనీ - తలో అద్దా చందా యేసుకుందాం. తొందరగాపోయి మునిచపలోళ్ళకి సెప్పిరా. లేకపోతే కొంపతీసి నువ్వే దాన్ని సంపేశావంటారు.

(సాహెబ్ ప్రక్కన పడుకోబోతాడు)

విమల : (జోగాయ్ దగ్గిరికి వెళ్ళి) ఇక నాకిది కల్లో కొస్తుంది ... నాకెప్పుడూ చచ్చిపోయినాళ్లు కల్లోకొస్తుంటారు. వొంటరిగా యింటి కెళ్లాలంటే భయమేస్తోంది. బయట చీకటి కోణం ... భయం!
దాసు : (విమల దగ్గిరికివచ్చి) భయం! బతుకున్న వాళ్లంటే భయపడాలిగాని చచ్చినవాళ్ళంటే భయమేవిటి? పిచ్చిపిల్లా!
విమల : నన్నింటికి తీసికెళ్ళి దిగబెట్టిరా తాతా!
దాసు : సరే రా, నే దింపొస్తా.

[ఇద్దరూ వెడతారు. విరామం]

జోగాయ్ : ఓహో! సాయబూ! చీతాకాలం వచ్చిందిభాయీ! మన కాక్త గిట్టుబాటవుతుంది. రయితులూ, కూలోళ్లూ, కొడవళ్ళు పదునెట్టుకుంటున్నారు. ఇక మనం - సాయబూ! అపుడే గురకెడుతున్నాడు. వెదవ సాయబాయన!

భీమన్న : మస్తుగా నిదరోవడంలో సాయబయ్యేలు మొన గోళ్ళు.

గంగులు : (కొంప మధ్యలో నిల్చొని తేరిపార జూస్తూ) యిప్పుడేం జేసేదీ ?

జోగాయ్ : నిదరో!

గంగులు : (నెమ్మదిగా) యిక దానిగతేం గాను? (ఎవరూ జవాబి య్యరు. సత్యం, యాక్టర్ ప్రవేశం)

యాక్టర్ : (బిగ్గరగా) తాతా! భక్తరామదాసూ!

సత్యం : నటరాజు! నటరాజొచ్చాడు! హ హ హ...

యాక్టర్ : నిశ్చయం చేసేసుకున్నా. ఆ పట్నం యెక్కడుందీ? నువెక్కడున్నా?

సత్యం : పిచ్చిపుల్లయ్యా! తాత సెప్పిందంతా అబద్ధం. పట్నం లేదు, గిట్నం లేదు.

యాక్టర్ : అబద్ధం !

సాహెబ్ : (పక్క మీదినుంచి దిగ్గునలేచి) ఖామందూ హెకడా ? హాడ్నీ సూడావాలా. నిదరాపట్టద్. పైసా హెలా హిస్తాం. పీన్గుల్ ... థాగూమోతుల్ – థూ థూ.

(త్వరగా వెడతాడు. సత్యం యీలవేస్తాడు.)

భీమన్న : (నిద్రమత్తుతో) యేయ్, యేందా గోల! పడు కోండి ... నిదరోవాలనే గ్యానంకూడా లేదా యేం!

యాక్టర్ : ఆ శవం! "చచ్చిరి సోదరుల్సుతులు చచ్చిరి, చచ్చిరి రాజులెల్ల" బలే చావుకవిత్వం !

సత్యం : (బిగ్గరగా) శవానికేం వినిపిస్తుందా చస్తుందా! గోళ్జే యండి, గోళ్జేయండి. శవానికేం వినిపిస్తుందాచస్తుందా! ఊ...

[ తెర ]

# మూడో అంకం

[కొండయ్య యింటి పెరటిదొడ్డి. చెత్తా చెదారం. దొడ్డినిండా మొక్కలు. ఆకాశం కన్పించకుండా ఎత్తయిన రాతిగోడ. గోడప్రక్క పెద్ద పెద్ద మొక్కలు. కుడివైపున పశువులకొట్టాంగోడ. ఎడమవైపున కొండయ్య యిల్లు. అడుగుభాగం అర్ధకొంప. గోడలసున్నం ఊడి బెత్తలు బెత్తలుగా పడిపోతోంది. బూడిదరంగు. ఇంటి అవతలిమూల రంగమధ్యంలోవుండి రాతిగోడకు, యింటికిమధ్య దారివుండే రీతి కోణంలోవుంది. అడుగుభాగానికి ఒక కిటికీ, పైభాగానికి ఒక కిటికీ. ఇంటిగోడవెంట సుమారు 12 అడుగుల దుంగ, పెద్ద పాతకొయ్య, లాగుడుబండి తలక్రిందులుగా వున్నాయి. పాత కొయ్యచెక్కలు, దూలాలు, యింటి కుడివైపున పోగుగావున్నాయి. సాయంకాలం కావచ్చింది. అస్తమించే సూర్యుని కిరణాలలో రాతిగోడ ఎర్రగా ప్రకాశిస్తోంది. శీతాకాలప్రారంభం. మొక్కలింకా చిగర్చలేదు. దుంగమీద విమల, రాధ; లాగుడుబండిమీద దాసు, రాజా కూర్చున్నారు. గంగులు కుడిప్రక్క కొయ్యలపోగుమీద పడుకున్నాడు. అడుగుభాగం కిటికీదగ్గర భీమన్నరూపం కన్పిస్తోంది.]

రాధ : (కళ్లు మూసుకుని రాగయుక్తంగా చెప్పేకథకు అనువుగా తల వూపుతూ) మేం ముందుగా కూడబలుక్కున్నట్లు తోటలో పొదరింటికి అర్ధరాత్రి వచ్చేశాడు. యెంత సేపట్నించో కాసుకూచున్నా నేమో భయంతో విచారంతో నా వొళ్ళంతా గజగజ వొణికిపోయింది. అతనూ పాలిపోయి వొణికి పోతున్నాడు, చేతిలో రివాల్వరుంది.

విమల : (బటానీలు నములుతూ) అయితే బడిపిల్లలు మా దురుసు వాళ్ళనేమాట నిజమే నన్నమాట.

రాధ : భయ పడుతూ, భయ పడుతూ, 'ప్రేమనిధానమా!' అన్నాడు.

భీమన్న : భలే! నిదానమా!

రాజా : నోర్ముయ్. యిష్టంలేకపోతే చెవుల్లో దూదెట్టుకో అంతేగాని అదిచెప్పే అబద్ధాలకి మధ్యలో అడ్డం రావటమేవిటి? ఆ తరవాత.

రాధ : 'నా ప్రేమ నిధానమా, ప్రేయసీ! నిను పెళ్ళాట్టానికి మా వాళ్ళు సుతారం వొప్పుకోరు. శాపనార్థాలు పెడ్తారు. అందుకని నా ప్రాణం తీసేసుకుంటా' అన్నాడు. యిన్ని గుళ్ళెక్కించిన యిన్వాల్వాదుచ్చు కొని 'శెలవుహృదయేశ్వరీ, శెలవు! మనసు మార్చుకోలేను, నువ్వు లేకుండా వొక్కక్షణం బతకలేను. శెలవు!' అన్నాడు. అపుడు నేను 'ప్రాణనాథా! రావూ...'

భీమన్న : (ఆశ్చర్యంతో) యేంటీ? యెలా!

రాజా : (బిగ్గరగా) రాధా! అపుడే మర్చిపోయా, కిందటితడవ శర్మ అంటివే.

రాధ : (దిగ్గునలేచి) నోర్ముయ్, చచ్చుపీనుగా! మీకు - దిక్కుదివాణంలేని మీకు - ప్రేమ - నిజమైన ప్రేమ యేం అర్థమవుతుంది. నాకు-నాకు తెలుసు నిజమైన ప్రేమ అంటే యేవిటో! (రాజాతో) వూరూ పేరూ లేని వెధవ్వి. చదువుకున్నా నంటావే? పక్కమీదికి కాఫీ వచ్చేదేం?

బాసు : ఆగండి. అడ్డంరాకండి. చెప్పనీయండి ... ఈ అమ్మాయి మాటలు కాదు మనం లక్ష్యపెట్టవల్సింది. వాటి వెనక వుండే భావం. అదీ. వర్వాలేదులే. చెప్పమ్మా చెప్పు.

భీమన్న : పుల్హోలు కప్పుకున్నగాడిద ! సరే - తర్వాతద్ది యినండి.

రాజా : ఆ తరవాత.

విమల : వీళ్ళమాట వినక. యెవళ్ళువీళ్ళు? చెప్పుకోటానికి తమ కేంలేదని నువంటే వీళ్ళకి చుప్పనాత్తనం.

రాధ : (కూర్చుని) ఉహుం—ఇక నే చెప్పను. చెప్పనంటే చెప్పను. నా మాటలు నమ్మక నవ్వుతూంటే...

(హఠాత్తుగా ఆగి, ఒక క్షణం పూరుకొని తిరిగి కళ్ళుమూసుకొని చేత్తో తాళంవేస్తూ, దూరపుసంగీతం వింటున్నట్టు కన్పిస్తూ తిరిగి మొదలు పెడుతుంది) నే చెప్ప : 'నా జీవితసర్వస్వమా' నా ఆత్మ జ్యోతీ! నువులేని యీ ప్రపంచకంలో నేనుమాత్రం బతగ్గలనా? మనసారా నిను ప్రేమిస్తున్నా. బొందెలో ప్రాణం వున్నంతదాకా నిను ప్రేమిస్తూనేవుంటా. కాని - మీ నాన్నకీ అమ్మకీ నువ్వొకడివే కొడుకువి. వాళ్ళకి నువంటే ఎంతో ప్రేమ. నన్నిడిచిపెట్టేశెయ్. ప్రాణనాథా! నీ కోసం పరితపిస్తూ నే నాశనమై పోవడమే ఉత్తమం. నే నెందుకూ కొరగాన్నిదాన్ని.

(చేతుల్తో ముఖం కప్పుకుని ఏడుస్తుంది)

విమల : (ఇంకోవైపుతిరిగి మెల్లిగా) యేడవకమ్మా, యేడవక.

(దాసు నవ్వుతూ రాధతల నిమురుతాడు)

భీమన్న : తాతా! భలే పిల్లకాయిని దొరికించుకున్నావే !

రాజా : (నవ్వుతూ) యిదంతా నిజమనే నమ్ముతున్నావా తాతా? ఈ కథంతా ఆ 'ప్రళయప్రేమ' అనే పుస్తకంలోది. వొత్తి చెత్త......

విమల : దేముడు నిన్నిలా పుట్టించినందుకు నోరుమూసుకుని పడుండక యీ గొడవంతా నీ కెందుకు ?

రాధ : వోరి పాపిష్టి వెధవా – చచ్చుపీనుగా! నీకు హృదయం యెక్కడుందిరా ?

దాసు : (రాధచెయ్యి పట్టుకుని) వెళ్ళిపోదాం – పదమ్మా! వీళ్ళతో యేవిటి ? నువుచెప్పిందే నిజం – నాకు తెలుసు. నిజంగా ప్రేమించావని నువనుకుంటే నిజంగా ప్రేమించినట్టే. నిజం – వీడితో యేదో కాలక్షేపం చేస్తున్నావా, అటువంటప్పుడు వీడిమీదే కోపం పెట్టుకోడం అంత మంచిది కాదు. చుప్పనాత్తనం పుట్టి నవ్వుండొచ్చు...ఆ మాట కొస్తే నిజమైన ప్రేమదాకా యెందుకూ, అసలు ప్రేమంటే యేవిటో వీడికేం తెలుస్సా...పద పోదాం.

రాధ : (చేతులు గుండెలమీద వేసుకొని) నామాట నమ్మ్మతాతా ! వొట్టు. అతను కాలేజీపిల్లాడు. సిల్కుసూటు వేశేవాడు. నే జెప్పింది నిజంకాకపోతే నా తలపండు పగిలిపోవాలి! అబ్బ! యెంతప్రేమ, యెంతప్రేమ !

దాసు : నాకు తెల్సు. బెంగపెట్టుకోకేం. సిల్కుసూటు కదూ! నీ మాటనమ్ముతా. పాపం! నువ్వతణ్ణెంతగా ప్రేమించావో!

(యిద్దరూ వెళ్ళిపోతారు)

రాజా : పిచ్చిముండ! ... మనసు మంచిదే కాని తెలివితేటలు సున్నా.

భీమన్న : అలా అబద్దమాట్ట మెందుకూ? అదంతా నిజమని కోరుటులోలాగా పెమాణం సేయడమెందుకూ?

విమల : నిజం చెప్పడంలో కంటె అబద్ధమాట్టంలో యెక్కువ ఆనందం వుంది. నాకూ అంతే...

రాజా : నీకూనా? ఆ తరవాత—

విమల : నేనూ కలలు కంటుంటా. నేనూ కాచుకుని...
రాజా : యెందుకేం?
విమల : (కంగారుగా నవ్వుతూ) నాకేం తెలీదు... రేపుయెవరో... యెవరో ... యెవరో మహానుభావుడు ... ఆకాశాన్నుంచూడి పడతాడనీ లేకపోతే ఎదో ... ఎదో జరిగి తీర్తుందనీ... అందుకే కాచుకుని కూచున్నా. కాని జరిగే దేవిటి నా బొంద!

[విరామం]

రాజా : (చిరునవ్వుతో) కాచుక్చూచోడం వొత్తిదండగే. నామట్టుకు నేను దేని కోసం కాచుక్కూచోను. నా పసంతా అయిపోయింది. ఆ తరవాత
విమల : లేకపోతే, రేపు అమాంతం చచ్చిపోతానేమో నని పిస్తుంది. నరాలు బిగుసుకు పోతయ్. మరీ వేసంగిలో యిలాంటి ఆలోచన లెక్కవవుతాయ్. పిడుగుపడి యిట్టే చచ్చి పోతామేమోనని భయమేస్తుంది.
రాజా : నీదేం బతుకు, యెధవ బతుకు. యిదంతా నీ అక్క ఆ బ్రహ్మరాక్షసి మూలానే వొచ్చి పడింది.
విమల : యెవడి బతుకు బావుందేం? అందరి బతుకూ వొకలానే బండలైంది. నాకేం తెలీదనుకున్నా ?
గంగులు : (యింతవరకు తనకేంపట్టనట్టు మెదలకుండా పడుకున్న వాడు దిగ్గునలేచి) అందరి బతుకూ! అబద్ధం. అందరి బతుకూ వొకే యిదంగా వుంటే యింక గొడవేవుంది ?
భీమన్న : నీకు పొడుచుకొచ్చిందెందుకేం ? యేంటా మెర్రి కేకలు !

(గంగులు మళ్ళీ పడుకుని గొణుక్కుంటాడు)

రాజా : రాధతో రాజీపట్టం మంచిది. లేకపోతే సారాడబ్బులు గిట్టవ్.

భీమన్న : ఊఁ – మడుసులికి అబద్ధాలాట్టవంటే యింత సరదా యెందుకేం ? రాధా, కల్లుముంతకు రంగుపూసినట్టే రాధ అతనుకూ పూయాలనుకుంటుంది. సడే – తక్కినవాళ్ళకేం దొబ్బిడాయ్. ఆ దాసు, అంత ముసిలోడుకూడా సూడు – వొకటే అబద్ధాలు. దమ్మిడీ లాబం లేదు. యెందుకూ మరి అబద్ధాలాట్టం ?

రాజా : (వెక్కిళ్ళుపోతూ బుసకొడుతూ) అందరి ఆత్మలూ రంగు మాసిపోయాయ్... ... అందుకనే కొంచెం రంగుపూద్దా మనుకుంటున్నారు.

దాసు : (ప్రవేశించి) యేం, మహారాజా, ఆ పిల్లనెందుకలా క్షోభపెట్టం ? దానియేడుపు దాన్నేడ్చి సంతోషించనీ. కన్నీళ్ళు కార్చుకోడం దానికి సరదా అయితే నీదేం పోయింది ?

రాజా : తాతా! అది వొట్టిపిచ్చిది. యివాళ రావు, రేపు శర్మ ! వొళ్ళు మండుతుంది. మండితేనేంలే, వెళ్ళి రాజీపడతా.

(వెళతాడు)

దాసు : సరే, వెళ్ళు. దాంతో కాస్స మంచిగావుండు. మంచిగా వుంటే కొంపేం మునిగిపోదు లే

విమల : నీది కనికరపు గుండె తాతా! [illegible]పు తావ్?

దాసు : దయ! పోనీ – అలానే అనుకో. (రాతిగోడ వెనక నుంచి చిలకబుర్ర వాయిద్యపు మృదుమధుర సంగీతం వినిపిస్తుంది) యీ ప్రపంచంలో యెవరో వొకరు దయజూపకపోతే యెలానమ్మా? మనుషులంటే సానుభూతుండాలి. బుద్ధభగవానుడు అందర్నీ సమానంగా ప్రేమించాడు. అలానే నడుచుకోమని బోధించాడు. సమయానికి కాస్త దయ జూపించి యెందర్నో రక్షించొచ్చు. మచ్చుకి నే నొకమాటు వొక యింజనీరు గారి యెస్టేటులో కాపలావాణ్ణిగా వుండేవాణ్ణి. ఆ యెస్టేటు చుట్టూ అడివి. సరే. మాంచి శీతాకాలం. నేను వొంటరిగాణ్ణి ... బలేగా వుండేది నాపని ... కాని వోరోజున యెదో చప్పుడు... యెవరో కిటికీ బద్దలు కొడుతున్నట్టు వినిపించింది.

విమల : దొంగలే !

దాసు : అవును. దొంగలే. చొరబడుతున్నారు...నా తుపాకీ తీసుకుని బయలుదేరా...ఇద్దరు పచ్చిదొంగలు కిటికీ పగలగొడుతున్నారు. వాళ్ళపనిలో మునిగిపోయున్నారేమో, నేను రావడం కనిపెట్టలేకపోయారు. వెర్రికేకేసాను. "యెవడ్రావాడు, పొండి, యెధవల్లారా !" అని. దానిమీద వాళ్లు గొడ్డలో టుచ్చుకుని నామీదకొచ్చారు...'అడుగు ముందుకేసారో కాల్చేసేస్తా' అని హెచ్చరించా......నా తుపాకీ వొకమాటు వొకడికేసి, యింకోమాటు రెండో వాడికేసి గురిపెట్టి బెదిరించా. ఆపైన భయపడిపోయి నా కాళ్ళమీదపడి తమని వదిలిపెట్టమని వేడుకొన్నారు. ఇక నేను...ఆ గొడ్డలిమూలంగా వొళ్లుతెలీని కోపంలో

వున్నా ... నేనన్నా: 'పొండ|్రా వెధవల్లారా! అని చెప్పానా? మీరు పోకపోతిరి... అందుకని మీలో వొకరు మంచి చువ్వవిరవండి.' చువ్వ తెచ్చారు. మళ్ళీఅన్నాను: "మీలో వొకళ్లు వంగోండి, రెండోవాడు దెబ్బలు గొడ తాడు" అని. నా ఆజ్ఞ|్రపకారం, అలా వొకళ్ళని వొకళ్ళు చావమోదుకున్నారు. దెబ్బలుకొట్టుకోవడం ఆఖరైనాక, 'తాతా! పున్నెముంటుంది. కాస్త తింటానికి యేమన్నా పారేయ్. కడుపులో ఆకలిమంటకి తట్టుకోలేక యిలా తిరుగు తున్నాం' అన్నారు. వీళ్ళా దొంగలు! (నవ్వు) గొడలి... పాపం! ఇద్దరి మనసులూ మంచివే. 'మొదటే ఆకలేస్తుంది యింత అన్నంపెట్టమని యెందుకడగకపోయారూ?' అన్నా. ...'మాకు వొంటో బాగుంటంలేదు. పైగా అడిగీ అడిగీ |్రపాణం విసిగెత్తిపోయింది' అన్నారు...ఆ విధంగా ఆ శీతాకాలమంతా నాతోనే వున్నారు. వాళ్ళలో వొకడు– వాడిపేరు రాముడు. తుపాకీతీసుకుని అడివిలోకెళ్ళి పిట్టల్ని కొట్టుకొచ్చేవాడు. రెండోవాడు–వెంకడికి పాపం! యెపుడూ జబ్బే– వుబ్బసం. మేం ముగ్గురం పొలాలు కాపలాకాస్తుండే వాళ్లం. శీతాకాలం వెళ్ళిపోగానే 'తాతా! శెలవు, దయుంచు' అని చెప్పి నైజాం చక్కా–బోయారు.

విమల: వాళ్లు జైల్లోంచి పారిపోయొచ్చినవాళ్ళు కాదుగదా?

దాసు: అవును. సరిగ్గా వాళ్లే... జైల్లోనించి తప్పించుకుని పారిపోయొచ్చారు. బలేవాళ్ళు!... అపుడు నేను దయ దలచకపోతే... నన్ను తరవాత చంపేసేవాళ్ళు, లేకపోతే యింకేమన్నా చేసేవాళ్ళు... దానిమీద యేమంటావేది?

విచారణ, జైలు, అండమాన్లకి పంపడం... యెందుకు ? జైలు, అండమాన్లు సవ్యమేమిటో అపసవ్యమేమిటో బోధిస్తాయా ?... కాని మనిషి... బోధించగలడు. సునాయాసంగా బోధించగలడు. (విరామం)

భీమన్న : ఊc - నా చంగతి సూడండి. నేను అబద్దాలాడ్లేను. అచలు అబద్దాలాట్ట మెందుకంట ! సత్తెక్కెక్కయ్. బయమెందుకు ?

గంగులు : (ఎవరో తన్నుకాలుస్తున్నట్లు అమాంతం లేచి బిగ్గరగా)సత్తెం! యేందాసత్తెం? (చిరిగిన బట్టలు చించి) యిదీ సత్తెం! వనీలేదు, సత్తవాలేదు. యిదీ సత్తెం. తలదాచుకోటానికి బెత్తెడి జాగాలేదు. కుక్కల్లా, నక్కల్లా పడిసావటం తపితే మిగిలిందేంది నా బొంద ! తాళు ! నీ సత్తెం నీకుంది. నీసత్తెం నా కెందికేం ? నాక్కావలసిందల్లా కాత్త వూపిరోసుకుంటానికి ఆసకారం...కాత్త వూపిరి. నేనేం తప్పాసేసా ... నీసత్తెం నాకెందుకేం ? నాకు బతకటానికి ఆసకారం కావాలి. కాని బతికి చావనీరు... ఆదీ అచలు సత్తెం !

భీమన్న : పాపం ! వాడి మదుసెంతబాద పడిందో !

దాసు : గంగులూ! వొకటి చెబుతా విను.

గంగులు : (ఆవేశంతో వణికిపోతూ)యిక్కడ మీరంతా సత్తాన్ని గురించి కోతలు కోసేస్తున్నారు తాతా! అందర్నీ వోదార్చాలని సూత్తున్నా! నాకు మదుసులంటే రోతపుట్టుకొత్తోంది. యిదీసత్తెం! తెల్సిందీ? యీపాటికి తెలిసొచ్చుంటది. నీ సత్తెం తగలడిపోను. (పరుగెత్తుకు పోతాడు)

దాసు : అరె! యేవిటీ చిందులు! యెక్కడికీ పరుగెత్తడం?

విమల : మతిపోయింది, పాపం.

భీమన్న : పరవాలేదులే. నాటకంలో వేసంలా వుంది...అప్పుడప్పుడు యిలా తిక్క వస్తూనే వుంటుంది. యింకా అనుబవం తక్కువ!

గోపాలం : (మెల్లగా ప్రవేశించి) యేం సక్క తాతా! యింకా కాకమ్మ కథలు చెబుతూనే వున్నా.

దాసు : గంగులుకి మతిపోయినట్టుంది తెలిసిందా?

గోపాలం : యెవరికీ, గంగులుకా? వాడికే యొచ్చింది తెగులు. శివమెక్కిన వాడిలా పరుగెత్తుకు పోతున్నాడేం?

దాసు : మనసుకు నొప్పితగిలితే యెవడైనా అలానే పారిపోతాడు.

గోపాలం : (కూర్చుంటూ) యేమైనా వాడంటే నాకు పరమ సహ్యాం. వొత్తిత్రాష్టుడు. పైగా తల పొగరు జాస్తీ (గంగుల్ని అనుకరిస్తూ) "నే పనోణ్ణి" అంటాడు. తతిమ్మా వాళ్ళంతా వాడికేమో తీసిపోయినట్టు! పని చెయ్యాలనుంటే ఊరే_వెళ్ళి పనిజేయాలి గాని అదేదో మహాగొప్పగా చెప్పుకోవడ మేవిటి? చేసే పన్నిబట్టి విలువ కడితే మనిషికంటె గాడిద యెక్కువ పన్జేస్తుంది. అస్తమానం వూరికే అడావిడిగా తిరగడం మాత్రం తెలుసు ... విమలా! మీ వాళ్ళంతా యింటోనో వున్నారా?

విమల : గుళ్లో కెడుతున్నామన్నారు.

గోపాలం : అందుకా దిలాసాగా తిరుగుతున్నా?

దాసు : (ఆలోచనా పూర్వకంగా భీమన్న కేసి తిరిగి) యేవిటీ? సత్యం? మనిషిలోవున్న చెడుగును సత్యంపోగుడుతుంది! ఊహుఁ... సత్యంతో మనిషిని బాగుచెయ్యలేం ... ఈలాంటి గొడవే వోటి జరిగింది. చెప్తా వినండి. నేనో మనిషి నెరుగున్నా. భూప్రపంచంలో యెక్కడో పుణ్యభూమి వుందని ఆయనకు నమ్మకం.

భీమన్న : యెందులో?

దాసు : పుణ్యభూమిలో - ఈ ప్రపంచంలో పుణ్యభూమివుండి వుండాలనే వాడు...ఆ పుణ్యభూమిలో విశిష్టప్రజ - పుణ్యపురుషులు - వొకర్నొకరు గౌరవించుకుంటూ, సాయం చేసుకుంటూ నివసిస్తున్నారనీ అక్కడ ప్రతిదీ భేషుగ్గా వుంటుందనీ తలచేవాడు. ఆ పుణ్యభూమిని వెదికి కనుక్కోవాలని ఆలోచిస్తుండేవాడు. అతను దరిద్రుడు... చాలా కష్టాలనుభవించినవాడు. చచ్చిపోవడమే నయం అనిపించేటంతటి కష్టాలు వచ్చిపడ్డా చిరునవ్వు నవ్వి 'సరే - యెలాగో భరిస్తా. యింకా కొద్దికాలం ఆగి, యీదేహం విడిచేసి పుణ్యభూమికి వెళ్ళిపోతా' అనుకునేవాడు. పుణ్యభూమి వుందనే నమ్మకం వొకటే అతనికి జీవితంలో సంతోషం కల్గించేది.

గోపాలం : సరే - అక్కడికి వెళ్ళగల్గాడూ?

భీమన్న : యెక్కడికీ? హాఁ - హాఁ.

దాసు : వాళ్ళవూరు. ఇదంతా అండమానుదీవిలో జరిగిందిలే. బాగా చదువుకున్నాయనొక్కణ్ణి ఆయనపుస్తకాలు, పటాలతోసహాలాక్కెళ్ళి అక్కడప్రవాసంలోవుంచారు. ఆయన్ని

మనవాడు 'ఆ పుణ్యభూమి యెక్కడుందీ, వెళ్ళడం యెలా?' అని అడిగాడు. వెంటనే ఆయన తన పుస్తకాలూ, పటాలూ తీసి చూచాడు, చూచాడు. కాని యేంలాభం! ఆ పుణ్య భూమి యెంతవెదికినా కన్పించలా. అన్నీ సవ్యంగానే వున్నాయి. పటాలమీద అన్నిదేశాలూ గీసున్నాయి. కాని ఆ పుణ్యభూమి మట్టుకు కన్ను పొడుచుకున్నా కన్పించలా.

గోపాలం: (ఆణకువ స్వరంతో) ఆ, అలాగా! యెక్కడా కన బడలా?

(భీమన్న నవ్వు)

విమల: యేయ్, యిక నవ్వు కట్టెయ్... తాతా, ఊఁ - కానీ.

దాసు: వాడికి నమ్మకంకలగలా...'ఎక్కడో వుండివుంటుంది. సరిగ్గా మాడు. పుణ్యభూమి కన్పించకపోతే నీ పుస్తకాలూ, పటాలూ ఎందుకు తగలబెట్టనా?' అన్నాడు. ఆ విజ్ఞాని కిదేం నచ్చలా. 'నా పటాలు మహామంచివి, నువుచెప్పే పుణ్యభూమి యెక్కడాలేదు' అని జవాబుచెప్పాడు. ఇంకే వుంది, దాంతోపాపం! మనవాడికి పిచ్చెత్తింది. 'యేమిటీ? అటువంటిభూమి వుందని నమ్ముతూ యింతకాలం యీ కష్టాలన్నీ సహిస్తూ బతుకుయీడ్చుకొస్తున్నా. యివాళ మీపటాలవల్ల అలాంటిదేం లేదని తేలిపోయింది! బూటకం! అంతే!' అనుకుని ఆవిజ్ఞానితో 'నువుమహాచదువుకున్నవాడి వేకాదు, వొట్టిమోసకారివికూడా.' అని యీ చెంపమీదా ఆ చెంపమీదా టపటపామని నాలుగుకొట్టి (విరామం) చక్కాబోయి వురేసుకు చచ్చాడు...

[అంతా నిశ్శబ్దం. దాసు చిరునవ్వు నవ్వుతూ గోపాలం, విమలలకేసి చూస్తాడు]

గోపాలం : (నిట్టూరుస్తూ) యేవిటీ ? అబ్బే, కథేం బాగుండలా.

విమల : తెలివితక్కువదద్దమ్మని చేసికూర్చోబెట్టాలనుకుంటే...

భీమన్న : (చిరచిరలాడుతూ) వొట్టి కట్టుకథ !...

గోపాలం : ఊఁ... అంటే చివరికి పుణ్యభూమంటూ కన్పించనే లేదన్నమాట !...

విమల : పాపం !

భీమన్న : యిదంతా యీనచొంతకయిత్తం...హహహ! పున్నె బూమి ! అంతా యీన తల్లోనించి మొలుచుకొచ్చిందే ! హహహః ! (కిటికీదగ్గరనుంచి వెళ్ళిపోతాడు)

దాసు : (భీమన్న కూర్చున్న కిటికీకేసి తలూపి) నవ్వుతున్నాడూ ? పాపం ! పాపం !... (విరామం) సరే, మీకందరికీ శుభం కలగాలి ! తొంతర్లోనే నేనిక్కడనించి వెళ్ళిపోతున్నా.

గోపాలం : యెక్కడికి పోతా తాతా ?

దాసు : ఉత్తరాదికి... అక్కడేదో కొత్తమతం బయల్దేరిందట !... అదేవిటో చూడాలి. మనుషులుకి యెప్పుడూ యేవో అవసరాలంటూ వుంటూనే వుంటాయ్. యింకా కాస్త మెరుగుకోసం పాకులాడుతూనే వుంటారు...వోర్పు వహించాలి. వోర్పు!

గోపాలం : యెప్పటికైనా సాధించగలరంటూ ?

దాసు : సాధించలేం దేముంది బాబూ... ! సాధిస్తారు. పాకులాడే వాడికి మంచి దొరికితీరుతుంది... చెడు కావాలనుకుంటే చెడే ప్రాప్తమవుతుంది !

విమల: ఓ – యెదైనా ప్రాప్తిస్తేనా?... ఆలోచిస్తే? ఇంకేం కావాలి.

దాసు: ఆలోచించకేం చేస్తారు! వాళ్ళకి మనం కాస్త సాయ పడాలి. వాళ్ళని గౌరవించాలి.

విమల: నేనేం సాయం చేయగల్గుతా నా బొంద! నాకే ఒకళ్ళ సాయం కావాలాయె!

గోపాలం: (నిశ్చితపూర్వకంగా) మళ్ళీ... నీతో చెబుతున్నా విమలా!... ఇదిగో యీయనముందే చెబుతున్నా... యీయనకంతా తెలుసు... నాతో వచ్చేసేయ్.

విమల: యెక్కడికి? యీ జైలునుంచి యింకో జైలుకా?

గోపాలం: దొంగతనంమా నేస్తానని నీతో చెప్పానా. ప్రమాణం చేస్తున్నా. 'ఇక దొంగతనం చెయ్యను' మా నేస్తానని చెప్పా నంటేమా నేసానన్నమాటే. నాకుచదవనూరాయనూవచ్చు ... కష్టపడి పనిచేస్తా ... మనంతట మనం అండమానుకి పోవడం మంచిదంటున్నాడు తాత! వెడదామా? ఈ బతు కంటెనాకురోతపుట్టడం తెలీదనుకున్నావా? విమలా! నాకర్థ మైంది... జ్ఞానం వచ్చింది... నిజాయితీపరులమని చెప్పుకునే వాళ్లు చాలామంది నాకంటెయెక్కువ దొంగతనాలు చేస్తు న్నారు, పరవాలేదులేఅని నన్ను నేను సముదాయించుకునే వాణ్ణి... దానివల్ల ప్రయోజనం మేంగలగలా ... నాకా్క వలసిందదిగాదు. నేనుపశ్చాత్తాపమూపట్టంలేదు. అందులో నాకునమ్మకమూ లేదు... నామనసుకు తోచిందల్లావొకటే: యీ విధమైన బతుకోబతుకుకాదు. మనిషి యింకా బాగా బతకాలి. ఆత్మగౌరవం సంపాదించుకోవాలి.

వాసు : బలే! నీ కడుపు చల్లగా బలే ముక్క న్నావ్ నాయనా! ఔను. ఆత్మగౌరవం సంపాదించుకోవాలి.

గోపాలం : చిన్నప్పటినించీ దొంగతనాలు చేస్తుండేవాణ్ణి. ప్రతీవెధవాయి 'దొంగగోపాలం, దొంగగోపాలం' అని పిలుస్తుండేవాడు. నలుగురూ అన్నట్టే చివరికి దొంగనై వూరుకున్నా... తెలిసిందా? కసికొద్దీ దొంగతనాలు చేసా. దొంగనే పేరొచ్చింది. అదే ఖాయమై వూరుకుంది. యింకో పేరెట్టు విమలా? ఊ-

విమల : (విచారంగా) యేవిటో నాకునమ్మకం చిక్కడంలా ... ఇవాళ నామనసేం బాగుండలా ... అమాంతం ఎదోమూడు తుందనే అనుమ్మానంతో నా గుండె గబ గబా గబ గబా కొట్టుకుంటోంది. యీ విషయం యివాళ యెత్తకుండా వుంటే బాగుండేది గోపాలం!

గోపాలం : మరెపుడుయెత్తేదీ? యిదేం మొదటసారా, చెప్పూ?

విమల : నీతో యెందుకూ వెళ్ళిపోవడం చెప్పు? నీ మీద ప్రేమా... యెక్కువున్నట్టు లేదు. ఒక్కొక్కపుడు నువ్వంటే యిష్టంగా వుంటుంది. ఒకప్పుడు నీ మొఖమే చూడబుద్దె య్యేదు. నీ మీద నాకు ప్రేమవున్నట్టు లేదు... ప్రేమిస్తే మనిషిలో చెడ్డ కన్పించేదికాదు. నీలో కావలసినంత చెడ్డ కన్పిస్తోంది.

గోపాలం : భయమెందుకే పిల్లా! క్రమంగా ప్రేమ అదేపుట్టు కొస్తుంది. ప్రేమించడం నేర్పుతాగా. ఊ, అను. నీ మీద సంవత్సరం కితమే కన్నడింది... నువ్వెంత మంచిదానివో, యెంతో గంభీరమైనదానివో గ్రహించా... యెంత నమ్మక

మైనదానివి!... అబ్బ! నువ్వంటే నాకుప్రాణమే, విమలా!
(బాగా అలంకరించుకుని కమల కిటికీలోకి వచ్చి సగం దాక్కుని వింటూ వుంది.)

విమల: నా మీద మనసయిందా? మరి... మా అక్కనేం జేస్తా!

గోపాలం: (కంగారుగా) యేవిటి జేసేది? దానిలాంటివాళ్ళు చాలామందున్నారు.

దాసు: అదేం పట్టించుకోకమ్మా! విశ్వామిత్రు డంతటివాడు తిండి దొరక్క కుక్కమాంసం తిన్నాట్ట!

గోపాలం: (విచారంగా) కాస్త దయుంచు విమలా! యిదేం బతుకు! కుక్క బతుకుతోంది నేనూ బతుకుతున్నా. సంతోషమా, బండలా. యేది ముట్టుకుంటే అదంతా బూడిదై పోతోంది. యిక మీ అక్క! అందర్లాంటిదీ కాదనుకున్నా. డబ్బంటే అంత పిచ్చిలేకపోతే దానికోసం యేం చెయ్యమన్నా చేసేవాణ్ణి. దానికి నా వొక్కడిమీద పిచ్చి వుంటేనా! డబ్బు పిచ్చి జాస్తి. తనిష్టం వచ్చినట్టు జరగాలనీ, స్వేచ్ఛగా తిరగాలనీ పట్టుదల. నాకేం సాయం చేసింది చెప్పూ? యిక నువ్వో, కల్పవృక్షానివి...

దాసు: విమలా! నామాటవిను. వీణ్ణి శుభ్రంగా పెళ్ళిచేసుకో. పైకి కనిపించేటంత చెడ్డవాడుగాడ్లే. 'మంచివాడివి' అంటూ వుండు. నీమాట నమ్ముతాడు... 'గోపాలం నువు మంచివాడివి' అంటూవుండు. మర్చిపోకేం. దాంతో వాడే దార్లోకొస్తాడు. యిక ఆలోచించుకో, యెక్కడి కెడతా? మీ అక్క వొస్తే పంపు. యిక దాని మొగుడు –

వాణ్ణి వర్ణిస్తానికి మాటలేదొరకవ్. యిక్కడ జట్టంతా యింతే... యింకెక్కడి కెడతా? ఏడికి మంచి సత్తువుంది.

విమల: యెక్కడికెళ్లేది, యేట్లోకి. నాకంతా తెలుసు. బాగా ఆలోచించా. అయితే - నా కెవరన్నా నమ్మకంలేదు. యెక్కడికెళ్లేది, యేట్లోకి ?

గోపాలం: యింకోతోవుంది. కాని నిన్నాతోవ తొక్కనిస్తానా, ముందు నీ ప్రాణంతీస్తాగానీ...

విమల: (చిరునవ్వుతో) యింకా పెళ్ళిలేదు, పెటాకులూలేదు, అపుడే ప్రాణంతీయడందాకా వచ్చా?

గోపాలం: (విమల చేతులుపట్టుకుని) క్షమించు, విమలా! క్షమించు

విమల: (దగ్గిరగా జరిగి) యిదిగో చెబుతున్నావిను, గోపాలం! దేవుడి సాక్షిగా చెబుతున్నా. యికమీదట నావొంటిమీద దెబ్బపడిందో, యే నుయ్యో గొయ్యో చూసుకుంటా. తెలిసిందా ?

గోపాలం: నీ మీద చెయ్యిచేసుకుంటే నా చేతులు చచ్చుడిపోతాయనుకో.

దాసు: వొకళ్ళకొకరికి సరిపోయింది, మేళం.

కమల: (కిటికీదగ్గర నుంచి) యింకేం, సంబంధం నిశ్చయమైందన్న మాట! ప్రేమ, గౌరవం, అణకువ...యింకేం !

విమల: ఆ - వచ్చేశారు, గోపాలం! అంతా విన్నట్టున్నారు కూడా.

గోపాల: యెందుకంత భయం! నీ వొంటిమీద చెయ్యెయ్యడానికి యెవడికి గుండెలున్నాయ్!

కమల : బెంగెట్టుకోకు, విమలా! కొట్టక్కే. వీడిసంగతి నాకు తెలీదూ? వీడు ప్రేమించాలేడు, కొట్టాలేడు. నాకు బాగా తెల్సు.

దాసు (నిట్టూర్చి) ఊఁ—ఆడది! ... విషప్పురుగు!

కమల : ఓ, వాగమంటే, బలేగా వాగుతాడు.

కొండయ్య : (ప్రవేశించి) యిమలా యిక్కడేం సేస్తున్నా! సోమారిముండా! మా మీద అవాకులూ, సెవాకులూ పేల్తున్నా. వొంటచేశా?

విమల : (వెడుతూ) గుళ్లోకి వెళ్లొస్తామన్నారుగా.

కొండయ్య : మేమెక్కడికి వెడతామంటే నేం? నీ పనేందో నువు సూసుకోక!

గోపాలం : నోరుముయ్! అదేం నీ దాసీ మనిషనుకున్నావా? విమలా! వెళ్లకు. యే పనీ ముట్టుకోకు.

విమల : అపుడే స్వారీ మొదలెట్టా. యింకా మూడు ముళ్లూ పడలా, జ్ఞాపకముంచుకో. [వెడుతుంది]

గోపాలం : కొండయ్యా! కబడ్దార్! ఇంతవరదాకా ఆటఆడావ్ గాని యిక నీ ఆట సాగదు. యికనించీ విమల నాదీ.

కొండయ్య : నీదా? యెపుడుకొన్నా? యెంతకొన్నా?

[కమల నవ్వుతుంది]

దాసు : గోపాలం, వెళ్ళిపో.

గోపాలం : బలేదంపతులు! జాగర్త. నవ్వులల్లా నువ్వులవుతాయ్.

కమల : అబ్బో! భయమేస్తోంది!

దాసు : గోపాలం! వెళ్ళిపో, తెలీటంలా, యెలాగైనా నిను రెచగొట్టాలని చూస్తోంది.

గోపాలం : ఆ-బొనాను. అబద్ధాలాడుతోంది ... అబద్ధం! నీ ఆటలు నాదగ్గిరేం సాగవ్, తెలిసిందా?

కమల : హుం-నే తల్చుకుంటేనా ...

గోపాలం : (పిడికిలితో బెదిరిస్తూ) చూద్దాంగా (వెళ్ళిపోతాడు)

కమల : (కిటికీ దగ్గరనించి వెడుతూ) నీ పెళ్ళి నీ చేయిస్తాగా!

కొండయ్య : (దాసుతో) యిక్కడేం చేత్తున్నా తాతా!

దాసు : యేంలా?

కొండయ్య : యెల్లిపోతావంటగా?

దాసు : యెంతకాలమనీ వొకచోట పడుంటం!

కొండయ్య : యెక్కడికి పోతా?

దాసు : ముక్కుకు సూటిగా.

కొండయ్య : మల్లీ సంచారం! వొకసోట కాల్నిలవదా యేం?

దాసు : 'నీరు పల్లమెరుగు' అన్నారు పెద్దలు.

కొండయ్య : అది నీటి యిసయం. మడిసి వొకచోట అంటి పెట్టుకు పోవాలెగాని కాల్గాలిన పిల్లిలా తిరగడమేంది? యెదో యిల్లూ, గొడ్డూ గోదా యేర్పర్చుకోవాలిగానీ...

దాసు : నా బోటివాడికి యెక్కడుంటే అదే యిల్లు.

కొండయ్య : అంటే వొర్తితిరుగుబోతువన్నమాట. యెందుకూ కొరగాని మడుసులుంటేం సస్తేం. ప్రతోడూ కష్టపడి పని సేయాలె.

దాసు : ఆ - అలాగేం ?

కొండయ్య : కాక మరేంటి ? కొత్తోడండే వోరూ ? కొత్తోడంటే చిత్తరమైనోడు. అందర్లాంటోడుకాడు. తీరతాలు సేవిస్తుంటే, అదీ యిదీ తెలుసేసనుకో, వోరికేంలాబం ? యెకడో యేదోసత్రెం దొరికించుకుంటేమటుకు సత్రాలన్నీ తెలుసుకోదగినయ్యా ?... తీరతాలు సేవించేవాడైతే ఆ సత్రెం తనకాడే వుంచుకుంటాడు. నోరెత్తడు. లేకుంటే వోరికీ అర్దంకాకుండా మాటాడ్తాడు...దేనంటాపడు. ఎలికి మీద పిల్లిసీ పిల్లిమీద ఎలికిసీ యెక్కించడు. వుత్తపున్నానికే వోర్కకట్టం తెచ్చి పెట్టడు...అళ్లూయీళ్లూ ఎలా బతుకులెల్ల మారుస్తున్నారో అని పట్టించుకోడు...పున్నెంకోచం తంటాలుపడాలి. వోరికంటా పడకుండా గుహల్లో తపచుసేసుకోవాలిఅంతేగానిఅళ్ల యవాడంలోయీళ్ల యవాడంలో తలదూరిచి మంచీచెడ్డా అని సెప్పగూడదు.... అందరికోసం మొక్కుతుండాలె. అందరిపాపాలు పోవాలని దేముణ్ణి కోరాలె....అందుకని యీలోకం వాచనలు వదిలిచ్చుకోవాలె. అపుడే పారదనలుసేస్తాడు...అదీ సంగతి. (విరామం) కాని నువ్వు...యెలాంటోడివి? పరువూ మరియాదావున్నోడివేనా ?

దాసు : ఆ - మనుష్యులూ వుంటారు, మామూలు జీవులూ వుంటారు.

కొండయ్య : అబ్బో, మా తెలివియి తేటలు వోలకబోత్తున్నావే? నీ పొడుపుకతలు నా దగ్గరా - ... నీ కంటె రెండాకులు యెక్కువే సతికా...యేందంటున్నా? మనచులూ, జీవులూ!

దాసు : పొడుపు కథాలేదు, గిడుపు కథాలేదు. బీళ్ళు వుంటాయి, పంటపొలాలూ వుంటాయి. పంట పొలంలో యేది నాటినా పండితీరుతుంది... అంతే...

కొండయ్య : అయితే యేవంటా ?

దాసు : చూడూ – దేవుడొచ్చి "కొండయ్యా! మనిషిలాగా నడుచుకో" అన్నా నీలో పిసరంతైనా మార్పొస్తుందీ ?

కొండయ్య : ఊ – తెలుసా, నా పెళ్లాం మేనమామ పోలీసు. వొక్కమాట సెప్పానంటే...

కమల : (వస్తూ) వంటయింది.

కొండయ్య : (దాసుతో) ఊ – యిక్కణ్ణుంచి యెల్లిపో. యీ తడవ మళ్లీ నా కంట బడ్డావో...

కమల : వెళ్ళిపో, తాతా ! నీ నాలిక మంచిదిగాదు... నువ్వే జైల్లోంచి పారిపోయి వచ్చావో యేమో యెవరికేం తెలుసు?

కొండయ్య : యికనుంచోకుండా పో, యెల్లక పోయావో...

దాసు : ఊ – పోలీసును పిలు. యెవడో దొంగ జైల్లోంచి పారిపోయొచ్చాడని చెప్పు – బహుమానం వస్తుంది. బహుమానం ! నాలుగు రూపాయలు!

భీమన్న : (కిటికీ దగ్గరనుంచి) యేందీ నాల్గురూపాయలకి అమ్ముతామంటున్నారు ?

దాసు : నన్నమ్మేస్తామని బెదిరిస్తున్నారు ?

కమల : (కొండయ్యతో) పోదాం పద.

భీమన్న : తాతా ! జాగర్త. ధర పలక్కపోతే నిన్ను రూపాయీకే అమ్మేస్తారు. జాగర్త.

కొండయ్య : దెయ్యంలా మల్లా తయారయ్యా? (భార్యతో వెడతాడు)

కమల : (దారిలో) ఈ ప్రపంచమంతా దొంగల్తో, పుండాకోర్లతో నిండి పోయింది!

దాసు : వెళ్ళి కడుపునిండా ఆరగించు!

కమల : ఛీ, నోర్ముయ్! పుచ్చు కుక్కా! (వెళ్ళిపోతుంది)

దాసు : ఈ రాత్రికి బయల్దేరి వెళ్ళిపోతా.

భీమన్న : ఊఁ-పుడాయిచు. ముందుగా మేలుకోటం యెందుకైనా మంచిదీ.

దాసు : నిజం! నిజం!

భీమన్న : నా కనుబవమైందితాతా! ముందుగా మేలుకోటం వల్నే నాకు జైల్రాత తప్పింది.

దాసు : యేవిటీ? నిజంగానే?

భీమన్న : నిజం! నా పెళ్లానికో కలంకారోడితో యిలాకా వుండేది. వాడు బలే గట్టోడు. రంగు వేయడంలో మాంచి చెయ్యి. బలే చురుకైనోడు. వాడితోటే నా పెళ్ళానికి యిలాకా - అల్లిద్దరూ వొకళ్ళి చక్కా బోయా టప్పటికి యిసంపెట్టో మరోయిదంగానో నను సాగనంపుతారసభయమేసి జాగర్తగా బతకాల్సొచ్చింది. నాపెళ్లాన్ని నే తన్నినపుడల్లాఆడొచ్చినను తంతుండేవోడు. ఆడు ముందూ యెనకా సూడకుండా పోటాడేవోడు. వోమాటు నా గడ్డం పీకి యెముక లిరగ్గొట్టాడు. నాకూ వొల్లుమండి పోయేది ... వోనాడు యినప పటకారెట్టి నా పెల్లాం నెత్తి మీదొక్కటేశా. దానిమీద పెద్దగోల బయల్దేరింది. దాని వలాబంల్ల

మేం లేదని నాకు తెల్సు ... నాపని పట్టిత్తారు. అందుకని నా పెల్లాన్ని యెలాగైనా సంపేద్దామని యెత్తేసా. యెత్తు పారుంటేనా? ... కాని సరిగ్గా సమయానికి పట్టుబడి పారి పోయొచ్చా ...

దాసు : మంచి పన్జేశావు. వాళ్ళిష్ట మొచ్చినట్లు రంగులు గీకు తుండనీ.

భీమన్న : దుకానం నా పెల్లాంది. అందుకని అక్కడడుండి పోయింది. నేనీ తితికివచ్చా ... నిజం సెప్పాలంటే నేను దుకాణమంతా తాగేశా ... తాగుడు మూలంగా ...

దాసు : తాగుడు – ఊఁ.

భీమన్న : నే నొక్క తాగుమోతోణ్ణి. గొంతుదాకా తాగేత్తా. తాగుడు మొదలెట్టానో నా చర్మం అమ్మికూడా తాగేత్తా. పైగా నాకు సోమారితనం బలిసింది. ఏనంటే నాకెంత రోతో నీకేం తెలుచు ?

(సత్యం, యాక్టర్ వాదించుకుంటూ)

సత్యం : నీమొహాం, యెక్కడికి వెళ్ళేది ? యేమన్నా పిచ్చె త్తిందా యేం ? తాతా ! వీడితల్లోకేం యెక్కించా ?

యాక్టర్ : వీడిచెప్పేదంతా పచ్చి అబద్ధం తాతా ! నేనీ రోజు పన్జేశా. వీధూడ్చా ! ఒక్క చుక్కన్నా తాగలా. యింక మత్తెలా యెక్కుతుంది. తెలిసిందా ? ఇదిగో రూపాయి...

సత్యం : వోరిదద్దమ్మా ! ఇలా పారెయ్. నే తాగేస్తా లేకపోతే చీట్లపేకలో తగలేస్తా.

యాక్టర్ : నీ పిచ్చివేషాలు నాదగ్గిరా, యిక కట్టెయ్. ఆ రూపాయెట్టి టికెట్టుకొని 'జా పరమేశ్వరా!'

దాసు : సత్యం! యెన్నో మంచిదోవలో పడుతున్నవాణ్ణి మళ్లీ తప్పుదోవలోకి దింపుతున్నావేం ?

సత్యం : తాతా! నా ముందుగతి యేంకానుందో చెప్పాతాతా! వున్నదికాస్తా గోవిందా అయిపోయింది. అయితేనేం - ప్రపంచానికేం నష్టం! తాతా! నాకంటే తెలివిగలాళ్ళు చాలామందున్నారు.

దాసు : బలే హుషారైనవాడివే - ఊఁ -

భీమన్న : యేయ్ యాక్టర్ ! యిలారా.

(యాక్టర్ కిటికీదగ్గరికి వెళ్ళి భీమన్నతో మెల్లగా మాట్లాడడానికి వంగుతాడు.)

సత్యం : పడుచుదనంలో బలే సర్దాపురుషుణ్ణి. ఆ రోజు లెంత బావుండేవి. బలే మొనగాణ్ణి...దివ్యంగా డ్యాన్సు చేసే వాణ్ణి. వేషాలు వేసేవాణ్ణి. జనం విరగబడి నవ్వేవాళ్ళు. బలే! బలే!

దాసు : మరి చక్రం యిలా తిరిగిందేం బాబూ!

సత్యం : యేవిటా జిజ్ఞాస! ప్రతిదీ నీకే కావాలి. యెందుకేం?

దాసు : మనుషులసంగతేవిటో తెలుసుకుందామనీ. కాని నీ విషయం చూస్తే - అంతేమీ చిక్కడంలా. సత్యం! నువెంతో మంచాడివి, తెలివైనవాడివి. యేవిటీ చిత్రం! యిలా అయిపోయినావేం ?

సత్యం : జైలు, తాతా! జైలు. నేను నాలుగేళ్ళ యేడునెల్లు జైల్లోగడిపాను....తరవాత నా మొహమెవరు చూస్తారు!

దాసు : జైల్లో యెందు కేసారేం ?

సత్యం : వొక వుండాకోరు మూలంగా. వొళ్ళుమండి, ఆ మంటలో వొకణ్ణి చంపేశా. జైల్లో అన్నిటితోపాటు చీట్లాట అలవాటయింది.

దాసు : ఆడదానిమూలంగా వాణ్ణి చంపావుకదూ ?

సత్యం : ఆ - మా చెల్లి మూలంగా. ప్రతీదీ తెలుసుకోవాలను కోకు. ప్రశ్నలంటే నాకు తలకాయ నొప్పి. పైగా యెన్నడో జరిగిపోయిన విషయం. మా చెల్లి చచ్చిపోయి అపుడే తొమ్మిదేళ్ళయి పోయింది. మా చెల్లి ముద్దులు మూట కడుతుండేది.

దాసు : బతుకు బరువు చేసుకోకు. యిందాక అ తాళాలోడి అరుపులు విన్నావుగా.

సత్యం : యెవరు గంగులా ?

దాసు : అఁ - 'పన్లేదు, పన్లేదు' అని వొక రేగోల.

సత్యం : నాలుగు రోజులుపోతే అదే అణిగిపోతుంది. ఇక నేనేం చెయ్యాలి ?

దాసు : (నెమ్మదిగా) అడుగో ! వస్తున్నాడు.

(గంగులు తలవంచుకుని నెమ్మదిగా ప్రవేశం)

సత్యం : యేయ్ గంగులూ ! యేవిటి మహాదీర్ఘంగా ఆలో చిస్తున్నా ?

గంగులు : 'యేంసేద్దామా' అని ఆలోసిత్తున్నా. పనిముట్లన్నీ దాని దగనానికెల్లి పోయాయ్.

సత్యం : నా మాటవిను. గోళ్ళు గిల్లుకుంటూ కూర్చో. ప్రపంచకానికి బరువుగా తయారుగా.

గంగులు : మాట్లకేం, కొట్లాడ్డాయ్. గల్లుల్లో తిరగాలంటే చిగ్గేత్తోంది.

సత్యం : చాల్లే. నువ్వు కుక్కలా నక్కలా వెధవ బతుకు బతుకుతూంటే నలుగురూ సిగ్గుపడుతున్నారా ? ఆలోచించుకో-పన్జేయడం మానేయ్. నేనూమానేస్తా.అందర్నీ-వందలు, వేలమందిని మానెయ్యమను. తెలిసిందా ? అంతా పని మానేద్దాం. వేలు కదపకుండా కూర్చుందాం! యేం జరుగుతుందో చూద్దాం !

గంగులు : మలమలమాడి సత్తాం.

దాసు : (సత్యంతో) సన్యాసం పుచ్చుకో, యే బాధావుండదు.

సత్యం : అంత మతిపోయిన వాళ్లెరూ యిక్కడ లేరు తాతా!

[కొండయ్య యింటి కిటికీలో నుంచి విమల కేకలు "ఎందుకూ? ఆగు. నే నేంజేసా?" అని వినిపిస్తాయి.]

దాసు : (ఆదుర్దాగా) విమల యెందుకో యేడుస్తోంది. పాపం!

[కొండయ్య యింట్లోనుంచి గంద్రగోళం, పళ్లాలు పగిలిన శబ్దం.

కొండయ్య : దొమ్మరిముండా! దెయ్యం!]

కమల : ఆగు - నా తడాఖా యేవిటో చూపిస్తా. నీ జిమ్మడా....

విమల : బాబోయ్! కొట్టిచంపుతున్నారు. బాబోయ్!

సత్యం : (బిగ్గరగా) యేవిటా గొడవ?

దాసు : (కంగారుగా అటూ ఇటూ తిరుగుతూ) గోపాలం! గోపాలం యెడీ? వాడు వస్తేనా? ఆరి దేముడా! యేయ్! తమ్ముడూ!

యాక్టర్ : (పరుగెత్తుతూ) ఇదిగో వాళ్ళవని నే పట్టిస్తానుండు.

భీమన్న : యీ మద్దె మళ్లీ యిమలమ్మని సావగొట్టం మొద లెట్టారు, యీ ళ్లదుంప తెగ!

సత్యం : తాతా! పద... రేపు కావలసొస్తే సాక్ష్యంపలకొచ్చు.

దాసు : సాక్ష్యం చట్టుబండ లైనట్టేవుంది. నే నందుకు పని కొచ్చేవాణ్ణేంగాను. యిపుడు గోపాలం వెంటనే వస్తేనా...

విమల : అక్కా! అక్కా! ఆ...

భీమన్న : నోర్నొక్కేత్తున్నట్టున్నారు. యెల్లిసూద్దాం. (వెడతారు)

[కొండయ్య యింట్లో గోల తగ్గిపోతుంది. మునీలాడు 'ఆగు' అన్న కేక వినిపిస్తుంది. తలుపు వేసిన ధ్వని. అక్కడి గోలనంతనూ యీ ధ్వని నరికి వేసినట్టనిపిస్తుంది. నిశ్శబ్దం. సంధ్యా కాంతులు]

గంగులు : (వెల్లకిలావున్న లాగుడుబండి మీదకూర్చుని యే గొడవా పట్టని వానిలా చేతులు నలుపుకుంటూ యేదో గొణుగుతుంటాడు. మాటలు క్రమంగా విన్పిస్తాయి.)

అయితే యెలా? యెలాగోలా బతకాలా? (బిగ్గరగా) కొంప! కొంప కావాలి! కొంపాలేదు, మట్టీలేదు. వొంటరివాణ్ణయిపోయా ... వొకళ్ళూ సాయం సేయరు. అదీ వొచ్చిన్నిక్కు.

[దిగజారిపోయి వెళ్ళిపోతాడు. కొద్ది సెకండ్ల నిశ్శబ్దంతర్వాత దూరంగా గొణుగుడు, క్రమేణా పెద్ద గోలగా విన్పిస్తుంది. వివిధ స్వరాలు విన్పిస్తాయ్.]

కమల : మీ కెందుకూ? నా చెల్లెల్ని కొట్టుకుంటా, చంపు కుంటా, మీ కెందుకూ? పొండి, అవతలికిపొండి.

కొండయ్య : చెల్లెలయితే మటుకు...

కమల : దొంగముండాకొడకా!

సత్యం: గోపాలాన్ని పిలవండి! పిలవండి! జోగాయ్! వూరు కుంటావేం రెండు తన్నక! (పోలీసు యీల)

సాహెబ్: (కుడిచెయ్యి వూగించుకుంటూ వచ్చి) పట్టాపగల్ ఖూనీ సేస్తుండార్! హిదియేంటి నాయం?

జోగాయ్: (పోలయ్యతో ప్రవేశించి) తిక్క కుదిర్చా.

పోలయ్య: యేం కొట్లాటకి దిగా.

సాహెబ్: మరిమీర్! మీరూ హేంసేస్తుండార్?

పోలయ్య: (జోగాయ వెంటపరుగెత్తుతూ) ఆగు - నా యీల యిస్నెయ్! యిస్నెయ్!

కొండయ్య: (పరుగెత్తుతూ) పోలయ్యా! పట్టుకో, పట్టుకో, సంపేశాడు.

(మూలనించి సుబ్బి, రాధ, జుట్టు విరబోసుకున్న విమలను పట్టుకుని మెల్లగా తీసుకొస్తారు. కొట్టబోతున్న కమలను వారిస్తూ సత్యం. ముత్తాయ్ కమలచెవిలో కేకలేస్తూ, యీలలేస్తూ అల్లరిచేస్తుంటాడు. ఇంకా చాలామంది చినిగిన బట్టలు కట్టుకున్న ఆడవాళ్ళు, మొగాళ్ళు ప్రవేశం)

సత్యం: (కమలతో) యేవిటి నీ వుద్దేశం? తొత్తుముండా!

కమల: పో, అవతలికి పో, దొంగెధవా? ప్రాణంపోతే మట్టుకు వదుల్తానా దీన్ని. నిలువునా చీల్చేస్తా.

సుబ్బి: (విమలని దూరంగా తీసికెడుతూ) సాల్చాల్లే. నయిపోతారు. చిగ్గులే. అంత పసువైపోతే యెలా?

పోలయ్య: (సత్యాన్ని పట్టుకుని) యింకేడ కెడతా?

సత్యం: జోగాయ్! చూస్తావేం? రెండుచ్చుకోక! గోపాలం... గోపాలం...

(అంతా రాతిగోడ దోవదగ్గిర గుమిగూడుతారు. విమలని దూరంగా తీసుకెళ్ళి చెక్కల గుట్టమీద కూర్చోబెడతారు.)

గోపాలం : (అమాంతంవచ్చి అందర్నీ తోసుకుంటూ) విమల యెక్క-డుందీ ? యెక్క-డుందీ ?

కొండయ్య : (యింటిమూల దాక్కు-ని) పోలయ్యా ! పట్టుకో. గోపాలాన్ని పట్టుకో. వాడే దొంగ! దొంగ !

గోపాలం : లంజకొడక ! (కొండయ్యాని యీడ్చికొడతాడు. తల, భుజాలుమాత్రం కనిపించే భంగిమంలో కొండయ్య పడిపోతాడు. గోపాలం విమలదగ్గరకు పరుగెడుతాడు.)

కమల : గోపాలాన్ని చావగొట్టండి. దొంగవెధవ ! చావ గొట్టండి!

పోలయ్య : (సత్యంతో బిగ్గరగా) పో – అవతలికి పో. యిదంతా యేందో యింటి గొడవా... ఆళ్లంతా సుట్టాలు... మద్దెన నువ్వోడివి?

గోపాలం : యేవిటి ! యేంచేసిండేం ? కత్తెట్టి పొడిచిందా ?

సుబ్బి : ఆ రాచ్చసెదవలు యేంచేసారో సూడు ! సలసలా కాగే నీల్లు మీదోశారు.

రాధ : వేడినీళ్ళ కాగుకాగూ మీంద దిమ్మరించారు...

సాహెబ్ : హెదో సూసోసూడ్రో! నిజంతెల్సుకోవాలా ...

విమల : (మూర్ఛపోతూ) గోపాలం! నన్ను తీసికెళ్ళిపో. యెక్క-డన్నా దాచెయ్.

కమల : ఆరిదేముడా! నాదేముణ్ణి చంపేశార్రోయ్. (అంతా కొండయ్య శవం దగ్గిరికి చేరతారు. భీమన్న అందర్నీ తోసుకుని గోపాలం దగ్గరకు వస్తాడు)

భీమన్న : (మెల్లిగా) గోపాళం! కొండాయ సచ్చాడు.

గోపాలం : (అర్థంకానట్టు చూచి) మంచం వోటి తీసుకురా — ముందు విమలని ఆసుపత్రికితీసుకుపోదాం. వీళ్ళతో నేవిటి— పద.

భీమన్న : కొండాయుని వోరో సంపేచారు. (నీళ్లు పోసిన నిప్పులా గోళ అణిగిపోతుంది. మందస్వరాలతో మాటలు "నిజంగానే" దారుణం 'హుం!' 'ఇకడనుంచి పోదాంపదండి' యేవిటా గొడవ! 'పోలీసులు రాకముందే మాపేసెయ్యండి.' గుంపు చెల్లాచెదరై పోతుంది. భీమన్న, సాహెబు, రాధ, సుబ్బి, కొండయ్యా శవం దగ్గరకు పరుగెడుతారు.)

కమల : (నేలనుంచిలేచి విజయ గర్వంతో ఏడుస్తూ) ఖూనీ! ఖూనీ! ఆ గోపాలంగాడే! నాకళ్ళతో చూచా. గోపాలం! ఊఁ—పద— యిక పోలీసులు నీపెళ్ళి చేస్తార్లే.

గోపాలం : (విమలని వదిలి) వెళ్ళిమాణ్ణీయండి. (కొండయ్యా శవం చూచి కమలకేసి తిరిగి) నీ కళ్లు చల్లబడ్డాయా? (కాలితో శవాన్ని తాకి) చచ్చాడు. కుక్క! తలుచుకున్నది యెలాగై తేనేం సాధించా వన్న మాట. నువ్వుమట్టుకు పుట్టిగట్టుకు పూరికే గుదా మనుకున్నా ? (కొట్టబోతాడు. సత్యం, జోగాయ్ అడ్డం వస్తారు. కమల పరుగెత్తుతుంది.)

సత్యం : గోపాలం! నువ్వేం చేస్తున్నావో తెలుసా?

జోగాయ్ : యిదేనా సమయం.

కమల : (వచ్చి) గోపాలం! బ్రహ్మరాసిన రాత యెవడు తప్పిస్తాడు. మామా! ఈలెయ్యి. పోలీసుల్ని పిలు!

పోలయ్య : వోరో నా ఈల కొట్టేచారు.

ముత్తాయ్ : యిదిగో! (ఈల వేస్తాడు. పోలయ్య వెంటబడతాడు)

సత్యం : (విమల దగ్గరకు గోపాలాన్ని తీసుకొడుతూ) గోపాలం! చింతె ట్టుకోకు. యెదో కొట్లాటలో చంపేశావ్. మరేం కొంప మునిగిపోదు లే.

కమల : పట్టుకోండి. గోపాలాన్ని పట్టుకోండి. వాడే చంపింది. నా కళ్లారా చూచా. పట్టుకోండి!

సత్యం : యిది వరకు మూడు నాల్గు సారులు వీడితాళంపట్టా. సరికేయాల్సింది. నే సాక్ష్యం పలుకుతా కమలా!

గోపాలం : తప్పించుకోవాలని నేనేం తహతహ లాట్టంలేదు లే. దీన్ని యిందులో కీడుస్తా. తన మొగుణ్ణి చంపమని నన్ను పురిగొల్పింది. పురిగొల్పింది!

విమల : (హఠాత్తుగా) ఆ–అదా! యిప్పుడంతా అర్థమైంది. ఇదా పన్నాగం, గోపాలం! ఆరిబాబూ, వీళ్ళిద్దరూ కలసి చేసిందే యిది! సరే – అందుకా గోపాలం! ఇందాక అవినేట్టు అలా మాట్లాడావ్! యిది వాడీముండ. మీకందరికీ తెలీని రహస్య మేముంది? యిద్దరూ కలిసి వేసిన యెత్తేయిది... మొగుడి మీద వుసిగొల్పింది. వీళ్ళిద్దరికీ మధ్య కొండయ్యా, నేనూ అడ్డమైనాం. అందుకే నన్నిలా చేశారు.

గోపాలం : యేవిటి విమలా! అలా మాటాడుతున్నావ్?

సత్యం : ఆ–!

కమల : అబద్ధం! శుద్ధ అబద్ధం! నేనా – ఉహు – గోపాలం వొక్కడే చంపాడు.

విమల : మీ యిద్దరూ కలిసి చేసిందే యీ కుట్ర. మీ పిండం బెట్ట!

సత్యం : బలే తమాషాగా తయారైందే వ్యవహారం! జాగర్త, గోపాలం! నీ మెడకి వురొచ్చి పడ్తుంది.

జోగాయ్ : మొదలా సివరా యేం అంతుసిక్కటంలా. బలే యవ్వారం!

గోపాలం : విమలా! యిదంతా నువు నిజంగా నమ్ముతున్నా? నేను దాంతో కలిసి ... ఎలానమ్మా ...

సత్యం : ఔను. విమలా! బాగాఆలోచించి మరీ చెప్పు.

కమల : నా మొగుణ్ణి చంపేశారు బాబోయ్! ఆ దొంగ గోపాలం ఖూనీచేసేశాడు. నా కళ్ళతో చూచా. వీళ్ళంతా చూచారు యిన్స్పెక్టరుగారూ!

విమల : (వొళ్ళు తెలిసీ తెలియనిస్థితిలో) ఖూనీచేసింది, మా అక్క — గోపాలం. యినస్పెక్టరుగారూ! నా మాట వినండి. మా అక్కవాణ్ణిపుసికొల్పింది. వీడెవడో తెలుసా? దానిమిండడు. వీడి తలపండగలా! వీళ్ళిద్దరూ కొండయ్యని చంపేశారు. వీళ్ళిద్దర్నీ తీసికెళ్ళండి. జైల్లో పెట్టండి ... నన్నూ తీసుకుపోండి. నన్నూ జైల్లో పెట్టండి! వొట్టు. నన్ను జైల్లో పెట్టండి!

[ తెర ]

# నాలుగో అంకం

[మొదటి అంకంలోలానే రంగస్థలం. కాని గోపాలం కోసం అమర్చబడ్డగది అడ్డం తీసేసి వుంటుంది. గంగులు యినప దిమ్మ కూడా లేదు. సాహెబ్ గోపాలం గదివుండేచోట అమర్చిన తిన్నెమీద మూలుగుతూ దొర్లుతుంటాడు. గంగులు బల్లదగ్గర కూర్చుని చిలక బుర్ర బాగుచేస్తూ మధ్య మధ్య శృతిగోలుపుతూంటాడు. బల్ల అవతలి చివర సత్యం, రాజా, రాధ సారా, కల్లుబుడ్లు, రొట్టిముక్కలు ముందు పెట్టుకుని కూర్చునివుంటారు. యాక్టర్ దగ్గుతూ పచార్లు చేస్తుంటాడు. రాత్రిసమయం. బల్లమధ్యదీపం. బయట గాలి వీస్తోంది.]

గంగులు : ఆఁ - ఆ సందట్లో సడేమియా అని మాయమై సక్కాబోయాడు.

రాజా : పోలీసులకి ఢోకాయిచ్చి చల్లగా - నిప్పునుంచి పొగలాగా జారుకొన్నాడు.

సత్యం : పాపాత్ములనించి పుణ్యాత్ముల్లాగా !

రాధ : తాత బలే మంచి మనిషి ... మీరు - మీరు మనుషులు కారు, పురుగులు.

సత్యం : రాధకి ఆ ముసిలోడంటే మహాభిమానం.

రాధ : ఔను. ఆయనంటే నాకు మహాభిమానం. నిజం ! ప్రదిదీమూచి ఆకళింపు చేసుకునేవాడు.

సత్యం : (నవ్వుతూ) బోసాడికి పాయసంలాంటివాడు !

రాజా : (నవ్వుతూ) పుండుకి పట్టీలాంటివాడు !

గంగులు : ఆయనగోరు దయదల్సేవోరు. మరి మీకు దయం టేంటో తెల్సేడూ్సా.

సత్యం : దయవల్ల నీకు వొరిగిందేమిటోయ్ గంగులూ !

గంగులు : దయసూపకయిబోయినా యితర్ల మడుచు నొప్పెట్ట కుండా మెలగే తిరుగుడు నీకు తెల్సు.

సాహెబ్ : (తిన్నెమీద కూర్చుని గాయపడ్డ చేతిని చంటిపిల్లని ఊపినట్లు ఊపుతూ) తాత - బలే హాద్మి. వాడ్కి హాత్మా నాయం తెలిసీ హుండాది. హాత్మా నాయం హుండావోడు బలే హాద్మి. నాయుం లేకాపోతే థూ...హాడు సుకాసెన్ హాద్మి.

రాజా : సాహెబ్బాదా, యేవిటా న్యాయం?

సాహెబ్ : హాదీ వేరూ నాయం ... తెల్సూ ...

రాజా : ఆ తరవాత

సాహెబ్ : హెవణ్ణీ కొట్టారాద్! హాదీ నాయం. సట్టం.

సత్యం : అదే 'పినాల్ కోడు'

రాజా : అపరాధ చట్టం.

సాహెబ్ : ఖొరాన్ సట్టం. మీ ఖొరాన్ మీకు సట్టం. సబ్ హాత్మా ఖొరాన్. హా-ఁ

గంగులు : (చిలక బుర్ర బిగిస్తూ) అదో సాకు. హు - సాయబు సెప్పిందే సరి ... అంతా సట్టం సెపినట్టు నడుసుకోవాలె యేదం సెపినట్టు నడుసుకోవాలె.

సత్యం : ఊఁ - కానీ. దంచెయ్!

భీమన్న : ఊఁ - యేదం సెప్పినట్టు సేసిసూడు.

సాహెబ్ : మహామ్మద్ ఖొరాన్ హిస్తూ, హిందిగో సట్టం! హాది సెప్పినట్టూ సెయ్యి' హాని సెప్పినాడ్. ఖొంతఖాలం పోయి

నాక ఖోరాన్ సాలాలేద్. ఖొత్తాసట్టం హోస్తుంది. ఖొత్తా ఖాలం, ఖొత్తా సట్టం హోస్తుంది. హంతే.

సత్యం : నిజం! నిజం! 'పీనాల్ కోడ్'కి కాలదోషం పట్టింది. మాంచి గట్టిచట్టం. అయినా ఆ చట్టం తుప్పుపట్టానికి చాలకాలం పడుతుందిలే !

రాధ : (బల్లమీద గ్లాసుతో కొట్టుతూ) యెందుకూ? యిక్కడ-మీ అందరితో నేనెందుకూ వుండటం? వెళ్ళిపోతా... యెక్కడి కైనా సరే భూమి చిరరికైనాసరే - వెళ్ళిపోతా.

రాజా : బోసికాళ్ళతో నేనా, సుందరీ!

రాధ : దిగంబరిణిగా! నాలుగు కాళ్ళమీద నడుస్తూ! తెలిసిందా?

రాజా : కంటికి పండగ! నాలుగు కాళ్ళమీద ... హా! హా!

రాధ : నేనలాగేవెడత. మీ మోహాలు చూడకుండా తప్పించుకోడానికి యెక్కడికైనా సరే వెళ్ళిపోతా. మీరన్నా, యేదన్నా నాకెంత అసహ్యంపుట్టిందో మీకేం తెలుసు?

సత్యం : వెడుతూ వెడుతూ డాక్టర్‌నికూడా తీసుకుపో... అలా వెళ్ళిపోవాలనే అతనూ చూస్తున్నాడు. భూమి అరమైలు యివతల ద్రేహం బాగుచేసే ఆసుపత్రుందని యిపుడే విన్నాడు.

డాక్టర్ : దేహం, వెర్రిపుల్లయ్యా !

సత్యం : సారావిషం యెక్కిన దేహాలకి...

డాక్టర్ : ఆ - వాడు వెళ్ళిపోతాడు. వెళ్ళిపోతాడు. చూడక పోతారూ ?

రాజా : ప్రభూ, యెవరా వాడు ?

యాక్టర్ : వాడా, వీడు!

రాజా : నాటకాధిదేవత ! ఆవిడపేరేవిటి ?

యాక్టర్ : దిష్టిపిడతా ! సరస్వతి ! దేవతకాదు, చదువులరాణి.

సత్యం : వాణి... పికవాణి...చదువులరాణి ! వాణో, గీణో గంగానమ్మకే తెలియాలి. ఇదంతా ఆ ముసలోడు తెచ్చి పెట్టాడు. యాక్టరికి పురెక్కించాడు.

రాజా : ఆ ముసిలోడు వొట్టి చాదస్తుడు.

యాక్టర్ : వొట్టి మూర్ఖులు, అడివిమనుషులు !... వాడు వెళ్ళి తీరుతాడు. చూడకపోతారూ మీరంతా హృదయంలేని రాతిబొమ్మలు ! " కడతేరరాదా మనసా " హెహెహే ! త్యాగయ్య కృతి! స్వయంగానే స్థానం సంపాదించుకుంటాడు. యిప్పుడు సూదిమోపినంత స్థలంలేకపోయినా.—

రాజా : అవును, లేదు, మహాశయా లేదు.

యాక్టర్ : " హృదయనాళము తెగిమె,
నా హృదయ ధనము తొలగిపోయెను
జీవిత ఫలము స్రుక్కి
నేలబడె నింక జీవింప నేల సఖుడ ! "

ఓహో ! భావకవిత్వం ! ఊ - నువ్వుమాత్ర మెందుకూ జీవించటం ! యెందుకు చెప్పూ ?

రాజా : యేయ్, నటరాజా ! యేవిటా కేకలు !

యాక్టర్ : వోరి అబద్ధాలకోరా ! కేకలేస్తున్నానేం?

రాధ : (తలెత్తి చేతులు వూపుతూ) ఊ-కానీ, కేకలెయ్యి. అందరికీ వినబడేట్టు అరు !

రాజా : యేవిటి నీ ఉద్దేశం, సుందరీ !

సత్యం : వాళ్ళ కర్మానికి వాళ్ళని విదుల్దూ రాజా! చావనీ... గొంతుచినిగేట్టు అరవనీ. వొకళ్ళ తలకాయ వొకళ్ళు పగల గొట్టుకుచావనీ... అసలు విషయం: తాత చెప్పినట్లు ఇతర్ల విషయాల్లో జోక్యం పెట్టుకోకు...ఆ ముసిలోడే మనవా ళ్ళందరినీ కల్లు తాగినకోతుల్ని చేశాడు.

గంగులు : మచ్చు సుందుసల్లి, దోవసూపకుండా సల్లంగా తప్పు కున్నాడు.

రాజా : ముసిలోడు వొట్టి దొంగముండాకొడుకు !

రాధ : నోర్ముయ్! నువ్వే దొంగముండాకొడుకువి!

రాజా : నోర్ముయ్! సుందరీ !

గంగులు : యిక సత్తెం ! ముసిలోడికి సత్తెంతో పనేంది... ఆడు సత్తానికి యెతిరేకి. అదే సరైంది. ఆలోసిత్తే సత్తెం గురించి యేం మాటాడ్తా. సత్తెం లేకుండంగానే మాటలు బలిసిపాయె. ఆ సాయబయ్యను సూడు. సెయ్యి యిరిగింది. తెగగొట్టేసుకోవాలె. అదీ సత్తెంసేసిన వుపకారం.

సత్యం : (బల్లమీద గుద్దుతూ) యిక కట్టెయ్యండి వాగుడు. మీ రంతా వొట్టిపశువులు – మట్టిబుర్రలు. తాతను గురించి యిక నోరు మెదపకండి. (ప్రశాంతంగా) రాజా ! అందర్లోకీ నువు మరీ అద్దాన్నం...నీ కేదీ అర్థంకాదు. పైగా నువాడేవన్నీ పచ్చి అబద్ధాలు. తాత దొంగవేషాలు వేసే వాడేంగాదు. యేది సత్యం ! మనిషి ! అదీ సత్యం ! యిది తాత అర్థంచేసుకున్నాడు. నువుఅర్థంచేసుకోలేకపోయావ్. మీ అందరివి వొట్టి మట్టిబుర్రలు! తాతని నే నర్థంచేసుకో

గల్గా. తాత అబద్ధలాడాడు. నిజమే. అయితే యెందు కాడాడు? మీా అందరిమీాద దయకొద్దీ అబద్ధాలాడాడు. చాలామంది తమ సోదరులమీాద దయదలచి అబద్ధాలా డుంటూరు. నాకు తెలుసు. నేను పుస్తకాల్లో చదివా. వాళ్ళు బహుపసందుగా, అందర్నీ కదిలించివేసే ఆవేశంతో అబద్ధాలాడ్తారు. అబద్ధాలాడి యితర్లని వోదార్చగలరు. తమ అదృష్టానికి తృప్తిపడేట్టు చేయగలరు. పనివాడిచెయ్యి విరగొట్టిన బరువుకు మద్దతు యివ్వగలరు. మలమలమాడి చచ్చే మనిషిని నిందించగలరు. మీావాడే అబద్ధాలు నాకు తెలుసు. గుండె నిబ్బరంలేని వాళ్ళకీ, యితరులమీాద పడి తినేవాళ్ళకీ అబద్ధాలు కావాలి... కొందరు అబద్ధాల అండతో బతుకుతారు. కొందరు అబద్ధాలముసుగులో బతుకుతారు. కాని స్వతంత్రంగా బతుకుతూ యితర్ల నెత్తురు పీల్చనివాడికి అబద్ధాలతో పనేమిటి ? బానిసలకీ కామందు లకీ అబద్ధా లేమతం. స్వతంత్రమానవుడికి సత్యమే దేవుడు !

రాజా : బలే! బలే! మహాబాగా చెప్పావ్. నువుచెప్పిన ప్రతి ముక్కా నా మనసులో ముక్కే ... నువు పెద్దమనిషిలా మాట్లాడావ్.

సత్యం : మీా పెద్ద మనుషులు మోసగాళ్ళలా మాటాడే టప్పుడు, మోసగాళ్లు యెప్పుడో వొకప్పుడైనా పెద్ద మని షుల్లా యెందుకు మాటాడకూడదు? - ఔను. నేను చాలా విషయాలు మర్చేపోయా. అయినా ఒకటి రెండు గ్యాప కమున్నయ్. తాత బలే చురుకైనవాడు. తుప్పట్టిన కాసీ డబ్బు మీాద తులిసాకు పసరులాగా తాత మాటలు నా

మీూద పనిజేసాయ్ ... ఆయన పేరుచెప్పుకుని తాగుదాం. యెదీ, గ్లాసు నింపు ...

[రాధ కల్లుతో గ్లాసునింపి సత్యానికిస్తుంది].

సత్యం : తాత తన తెలివి తేటల మీూద బతుకు తున్నాడు. స్వయంగా పరిశీలించి ఆకలింపు చేసుకుంటాడు. వొక రోజున అడిగాను 'తాతా! మనుషులు బతికేదెందుకు?' అని (దాసును అనుకరిస్తూ) యింకా కాస్త బాగు కోసరమే వాళ్లు బతుకుతూంట. చూడండి, కొంతమంది వడ్రంగులు వున్నారనుకోండి. ప్రపంచంలో కనీవినీ యెరగ నంతటి గొప్ప వడ్రంగి వాళ్ళల్లోంచి పుట్టుకొచ్చాడనుకోండి. అందర్నీ మించి పోతాడు. వాడిముందు యెవరూ నిలవలేరు. వండ్రంగంలో తన ప్రత్యేకత చూపిస్తాడు. ఒక్కదూకులో వండ్రంగం యిరవై యేళ్లు ముందుకు సాగిపోతుంది. ఇదే విధంగా కమ్మరులు...చర్మకారులు...మీూ కార్మిక లోక మంతా...రైతులు, మీూ పెద్దమనుషులు అంతా యింకా బాగుకోసమే బతుకుతూంట. తమకోసమే తాము బతుకు తున్నామని తలుస్తారు. కాని యింకా బాగుకోసమే బతుకు తూంట. ఇంకా ఉత్తమ మానవుణ్ణి తయారు చేయడానికి వంద సంవత్సరాలో యింకా యెక్కువో వాళ్ళు బతకాలసి వుంటుంది.

[రాధ సత్యం వంక సాభిలాషగా చూస్తుంది. గంగులు చిలకబుర్రి బాగుచేయడం మానేసి వింటుంటాడు. రాజా రొమ్ముమీద తల ఆన్చుకొని బల్లమీద తాళం వేస్తుంటాడు.]

సత్యం : వాళ్ళంతా యింకా బాగుకోసం బతుకుతున్నారు. మనం ప్రతివాణ్ణీ దయతో చూడాలి. 'యెవరూ? యెందుకు పుట్టాడు? యేం చేయగలడు?' అని యెవర్ని గురించీ మనం ఆలోచించ గూడదు. మన అదృష్టంకొద్దీ పుట్టాడేమో! మనకిగొప్ప సహాయం చేస్తాడేమో యెవరికి తెలుసు? ముఖ్యంగా పిల్లల్ని, చిన్నపిల్లల్ని దయతో జూడాలి! వాళ్ళ జోలికి పోగూడదు, దయతో జూడాలి.

(విరామం)

రాజా : (ఆలోచనా పూర్వకంగా) ఊఁ - ఇంకా బాగుకి! మా కుటుంబం గ్న్యాపకానికొస్తోంది. నిన్నటిదా, మొన్నటిదా! అశోకుడికాలంనించీ - మా కుటుంబంలో మహావీరులు, ప్రభువులు పుట్టారు. ఉత్తరాదినించి వొచ్చి కృష్ణదేవ రాయల ఆస్థానంలో చేరి మెట్టుమీద మెట్టుయెక్కి గొప్ప వాళ్ళైపోయారు. కొండవీడు రెడ్లకాలంలో మా ముత్తాత ముత్తాత పెద్ద ఉద్యోగంలో వుండేవాడు. యెంతడబ్బు! యెంతమంది సేవకులు! యెన్నిగుర్రాలు, యెంతమంది వంటవాళ్ళు...

రాధ : అబద్ధం! పచ్చి అబద్ధం!

రాజా : (దిగ్గనలేచి) యేవిటీ ? ఆ-ఆ తరవాత ?

రాధ : అంతా పచ్చిఅబద్ధం!

రాజా : (బిగ్గరగా) విజయనగరంలో భవనం, తంజావూరులో బంగాళా, బగ్గీలు!

[గంగులు చిలకబుర్రతీసుకుని యింకో వైపుకు వెళ్ళి చూస్తుంటాడు]

రాధ : అబద్ధం !

రాజా : నోర్ముయ్! వందలకొలదీ భటులు ! తెలిసిందా ?

రాధ : (సంతోషంతో) తాగుబోతెధవా !

రాజా : చంపిపారేస్తా !

రాధ : (పరుగెత్తుకొని వెళ్ళబోతూ) నీకు బగ్గీలేదూ, బూడిదా లేదు!

సత్యం : చాల్లే రాధా ! వాడికి పిచ్చెత్తించమాకు.

రాజా : కాస్త ఆగు - పేడపురుగా ! మా తాతకి...

రాధ : నీకు తాతెక్కడ తగలడ్డాడు? నీకుండిచచ్చిందేవిటి ?

సత్యం : (నవ్వు)

రాజా : (కోపంతో అలసిపోయి బెంచీమీద కూర్చొని) సత్తెం! ఆ లంజతో కలిసి... నువ్వా నవ్వుతున్నా? నువ్వా నమ్మడంలే. (ముష్టితో బెంచీమీద గుద్దుతూ నిరాశాభావంతో) నే చెప్పేదంతా నిజం ! దేవుడితోడు!

రాధ : (విజయగర్వంతో) హహహా-యేవిటా అరుపు ! యెవరూ నమ్మకపోతే మనసెలావుంటుందో యిప్పటికర్థమైందేం. పాపం !

గంగులు : (బల్ల దగ్గరకు వస్తూ) కొట్లాటయిపోతుందనుకున్నా...

సాహెబ్ : హరామ్ది మతీ బుర్రల్ ...థూథూ.

రాజా : నను... ననుజూచి నవ్వుతుంటే వూరుకుంటానా? నాదగ్గర ...ఋజువుచేస్తా. నా దగ్గర కాగితాలున్నాయ్ పూర్వం బగ్గీలు...

సత్యం : అవన్నీ మర్చేబో, రాజా ! మీతాత బగ్గీలుకూడా మర్చేబో...అవేం నీకు కూడు పెడ్తాయా గుడ్డపెడ్తాయా !

రాజా : అదిగాను, దానికెంత పొగరో చూడు.

సత్యం : ఔను. కాని అది నీకంటె చెడిపోయిందేవిటి? బిగ్గిలు, తాత, తల్లీ దండ్రీ లేకపోతేమట్టుకు?

రాజా : (శాంతపడి) వోర్నీమచ్చుమాయ! మొదలకుండా అన్నిటికీ తలొగ్గడం నీకు బాగా తెలుసు. నాకు నీతీ నియమం లేదనుకుంటా...

సత్యం : సంపాదించుకో ... (విరామం) రాధా! యీమధ్య ఆసుపత్రి కెళ్ళొచ్చా?

రాధ : యెందుకు ?

సత్యం : విమల్ని చూట్టానికి.

రాధ : యింకా నీకు తెలిలే? ఆసుపత్రినుంచి యెప్పుడో వుడాయించింది...మాయమైచక్కాబోయింది... వెతుక్కచచ్చినా జాడకూడా తెలీనీకుండా చక్కాబోయింది.

సత్యం : అంటే–అంతా...

గంగులు : వోరు వోర్ని సాదిత్తారో సూట్టానికి సోద్దెంగా వుంటద్ది. కమలమ్మోరు గోపాళాన్ని సాదిత్తదో లేకమోతే గోపాళం కమలమ్మోరునే సాదిత్తాడో...

రాధ : కమల యెట్లాగో గుంజుకుని యీ గొడవలోంచి బైట పడ్తుంది. వో శిజిత్తులమారినక్క! కానిగోపాలానికి మాత్రం కఠిన నరకంవేసి అండమాను పంపిస్తారు.

సత్యం : కాదు, కాదు. కొట్లాటలో పొరపాటున చంపాడని యేదో జైలుశిక్ష వేస్తారుచూడు!

రాధ : అద్దాన్నం! వాణ్ణిపంపించేస్తేనే మంచిది ... మిమ్మల్ని దర్శి పంపించేయటమే నయం. చెత్తవూడ్చినట్టు మిమ్మల్ని దర్శి వూడ్చి యేపెంటకుప్పమీదో పారెయ్యాలిసిందే.

సత్యం : (ఆశ్చర్యంతో) యేవి టంటున్నా? నీకేమన్నా మతి బోయిందా?

రాజా : యిష్టమొచ్చినట్టు వాగుతున్నందుకు చెంప పగల గొడతా.

రాధ : ఊఁ – కానీ. నన్ను ముట్టుకో చూద్దాం.

రాజా : ఆ – ...

సత్యం : ఆగు – దాన్ని ముట్టుకోకు. ఎవర్నీ బాధించకూడదు. యెంత మర్చే పోదామన్నా ఆ ముసిల్దాన్ని మర్చిపోలేక పోతున్నా. (నవ్వు) ఎవర్నీ బాధించకూడదు. నా బతుకంతా బండలై పోటానికి ఒక్కమాటు బాధించితే – ఆ తర్వాత యేం జేయాలి? క్షమించాలా? ఉహూఁ.– ఎన్నటికీ క్షమించ. యెవడూ ...

రాజా : (రాధతో) నువ్వు నాతో సత్రావని మర్చిపోయావా యేం? నువ్వు వొట్టిపురుగువి.

రాధ : ఊఁ–దౌర్భాగ్యపెధవా! నా మోచేతినీళ్ళు తాగుతూ చీడపురుగులా నా మీద బతుకుతున్నావ్, చాలదూ!

(మగవాళ్లంతా నవ్వు)

గంగులు : ఆ – యెర్రిపిల్లా – సీడపురుగు!

రాజా : అదంటే కోపమెలా వస్తుందోయ్ వొట్టిపిచ్చిపిల్ల!

రాధ : నవ్వులాటగా వుందేం? నిజంగానే?

యాక్టర్ : (చిరచిరలాడుతూ) పిల్ల రోగం కుదుర్చు రాధా!

రాధ : కుదర్చగలిగితేనా ... ఊఁ-వాడిరోగం కుదురుస్తా! కుదురుస్తా! (కప్పు తీసుకొని నేలకేసి కొడుతుంది) యిలాగే విూ రోగం కుదురుస్తా!

సాహెబ్ : కప్పుల్ బద్దల్ గొట్తావ్ హెంద్యా సుక్యా!

రాజా : (లేస్తూ) ఊఁ-మంచీ మర్యాదా దీనికి నేర్పాలి.

రాధ : (తలుపుకేసి పరుగెడుతూ) చావండి. చచ్చినాళ్ళల్లారా!

సత్యం : (పిలుస్తూ) యేయ్! యికచాల్లే! యేవిఁటా బెదిరింపులు! యింతకీ యీ గొడవంతా యెందుకొచ్చింది?

రాధ : రాక్షసి వెధవల్లారా! చావండి. రాక్షసి వెధవల్లారా!

యాక్టర్ : (చికాకుగా) ఓం శాంతిశ్శాంతిః.

సాహెబ్ : ఓ — హిందూ హోడ్లోళ్ళు - నీసులు - మాటా హాడితే హాడల్... సొతంతరం జాస్తి... మా సాహెబ్ హోడ్లోళ్ళు మాలానహిఁ. హాళ్ళకే సట్టం తెల్సు.

గంగులు : ఆ - యీపు యిమానం మోతమోగించాలి!

రాజా : ఆ - వొట్టి యెడ్డి మొహాలు.

గంగులు : (చిలకబుర్ర బాగుచేసి) తయారైంది. సచ్చినోడు... ఆడు వొస్సాడవేలేదు.

సత్యం : ఊఁ - వోగ్లాసు...

గంగులు : సడే - సీకటడుతోంది... యిక లోపలికెల్లేయేల యింది.

సత్యం : మళ్ళీ యీ ప్రపంచంలో పడ్డా?

గంగులు : (తాగి, మూలనున్న తిన్నెదగ్గిరికి వెళ్ళి) మఁరేం పరవాలేదు. పపంచమంతా మడుచులున్నారంటారు. మొదట్లో గురుతు

కొచ్చిసావరు. తరవాత తరవాత తిన్నగా సూడగా సూడగా అంతా మడుసులే... మరేం పరవాలేదు.

(సాహెబ్ పక్కమీద గుడ్డపరిచి మోకాళ్లమీద కూర్చుని నమాజు మొదలుపెడతాడు)

రాజా : (సత్యానికి సాహెబ్‌ని చూపిస్తూ) చూడు...

సత్యం : వాణ్ణొదిలెయ్ యెదో మంచాడు... వాడి జోలికిపోక. (నవ్వి) యెందుకో యివ్వాళ నాకు దయపుట్టుకొస్తోంది.

రాజా : తాగినప్పుడల్లా నీకు దయ, తెలివితేటలు పుడతాయి.

సత్యం : తాగినపుడు అంతా అద్భుతంగా కనిపిస్తుంది. ఊఁ... ప్రార్థన చేస్తున్నాడు. బలే ! మనిషి ఆస్తికుడూ కావచ్చు, నాస్తికుడూకావచ్చు! అదివాడిష్టం. వాడికి స్వతంత్రంవుంది. ఆస్తికుడైనా, నాస్తికుడైనా, ప్రేమించినా, తెలివిగలాడైనా ప్రతీదానికీ మనిషి త్యాగం చెయ్యాలి. మనిషి త్యాగం చేస్తాడు. అందుకనే స్వతంత్రుడు ... మనిషి ! అదీ సత్యం! మనిషంటే ? ... నేను కాదు, నువ్వు కాదు, వాళ్లూకారు ... కారు. నువ్వూ, నేనూ, వాళ్లూ, తాతా, శివాజీ, కృష్ణుడూ అంతాకలిస్తే మనిషి. (గాలిలో మనిషి ఆకారంగీస్తూ) తెలిసిందీ? బలే! ఆద్యంతాలన్నీ కలిపితే మనిషిలోనివన్నీ ... అన్నీ మనిషికోసమే. మనిషొక్కడే సత్యం. తక్కినవన్నీ అతని చేతుల్లో మనసుతో చేయబడ్డవే. మనిషి యెంత అద్భుతమైనవాడు! మనిషి! మనిషి అనే మాట యెలా చెవిలో గింగురు మంటోందో! మనిషిని గౌరవించాలి, దయదల్చకూడదు. దయ దల్చడం నీచపర్చడం. గౌరవించాలి! యిదిగోరారా! మనిషి చల్లగా వరి

ల్లాలని తాగుదాం లే. (లేచి) మనిషి ననుకోవడం యెంత మెరుగు! యిదిగో నేను వొకప్పుడు ఖైదీని, హంతకుణ్ణి, పేకపక్షిని – అయితేనేం! పీథెంటవెడుతుంటే జనం నన్ను దొంగనుకుంటారు. పక్కకితొలగి నాకేసి తేరిపారజూస్తాడు. 'బటాచోర్' అని పిలుస్తారు. దొంగవెధవ అంటారు. 'పనిచేసుకు ఏడవరాదూ' అంటారు. ఊ – పని ఎందుకూ? పాడుపొట్ట నింపుకోవడానికేగా! (నవ్వు) యెవ్వడూ పొట్ట పొట్ట అని ఒకటే గోలచేసేవాళ్ళంటే నాకు పరమసహ్యాం. అదిగాదు, రాజా! అదిగాదు. మనిషి వీటన్నిటినీ మించిన వాడు. మనిషిపొట్టని మించినవాడు.

రాజా: (తలూపుతూ) యిలాంటి ఆలోచన్లు చాలా చెయ్యొచ్చు ...మంచిదే. మనసుకు నచ్చాలి. యింక నా విషయం అలా ఆలోచించ లేను. ఎలా ఆలోచించాలోకూడా తెలీదు. (చుటూ చూచి జాగ్రతగా మాట్లాడుతాడు) అపుడపుడు నాకు భయ మేస్తుంది. తెలిసిందా? వణికిపోతా. తరవాత యేం జరుగుతు తుందీ అని ఆలోచిస్తూంటా.

సత్యం: (పచార్లుచేస్తూ) యేవిటీ? మనిషి యెవడికి భయపడ తాడు?

రాజా: నీకు తెలీదూ ... నాకు గ్యాపక మున్నంత వరకు నా బుద్ధిలో యెదో మంచులాంటి దుండేది. యెదీ అర్థమ యేది కాదు. చిత్రం! నా బతుకంతా బట్టలు మార్చడంలా అనిపించేది – యెందుకు? అర్థంకావటంలా. మొదట్లో విద్యా ర్థిని. సూటు బూటు హాటు వేసుకు తిరిగేవాణ్ణి. అక్కడ నాకేం నేర్పారు? గ్యాపకంలేదు. పెళ్ళిచేసుకున్నా. రక

రకాల దుస్తులు వేసుకునేవాణ్ణి. కాని నా పెళ్ళాం మహా చెడ్డది. యెందుకుదాన్ని పెళ్ళాడా? దేవుడికే తెలియాలి! డబ్బంతా తగలేసా ... గూడకట్టు, బస్టీన్లకి దిగింది బతుకు. అంతా యెలా నష్టమైపోయింది? యెలాగో గమనించలా. సర్కారుకోగ్యం చేసా. మళ్లీ సూటు బూటు! సర్కారు డబ్బు తినేసా. యింకేం జోడు తగిలించారు. తరవాత యీ పనులన్నీ చేసా. అంతే ... యేదో కల ... కాదూ? చిత్రంగా లేదూ?

సత్యం : ఊహూం - చిత్రంగాదు, వొట్టి తెలివి తక్కువతనం.

రాజా : నిజం! నేనూ యిదంతా తెలివి తక్కువ తనమే ననుకుంటున్నా. యింతకీ నేనెందుకో - యేదో ఘనకార్యం చెయ్యడానికి పుట్టా ననుకుంటా? కాదూ ?

సత్యం : (కొంచెంనవ్వి) బహుశా ... మనిషి యేదో మెరుగు కోసమే పుట్టాడు. ... (తలూపుతూ) అదీ సంగతి, బలే!

రాజా : దాన్తగలెయ్య, ఆ రాధ యెక్కడికి బోయింది. చూసొస్తా, యెంతైనా ... (వెడతాడు. విరామం)

యాక్టర్ : సాహెబయా! (విరామం) నవాబ్జాదా! (సాహెబ్ తిరుగుతాడు)

యాక్టర్ : నా బాగు కోసం కూడా ప్రార్థన చెయ్.

సాహెబ్ : హేమిటీ ?

యాక్టర్ : (మృదువుగా) ప్రార్థనచెయ్. సామెబూ, నా బాగు కోసం.

సాహెబ్ : (కొంచెం ఆగి) మీరా నమాజ్ నువ్వూసేసూకోభాయ్!

యాక్టర్ : (గ్లాసులో సారా పోసుకుని వణికే చేతుల్తో తాగిపరుగెడుతూ) నే నెళ్ళిపోతున్నా! నే నెళ్ళిపోతున్నా!

సత్యం : యేయ్, వీరబ్రహ్మం ! యెక్కడికి కెడుతున్నా ?

(ఈల వేస్తాడు. ప్రవేశం భీమన్న, పోలయ్య, పోలయ్య రెవికె తొడుగుకొని; ఇద్దరూ కొద్దిగా తాగున్నారు. భీమన్న కుడిచేతిలో రొయ్యలు, ఎడమచేతిలో చేపలు, ఒక చంకలో సారాసీసా. కోటు జేబులోంచి ఇంకో సీసా తొంగిచూస్తూ వుంటుంది.)

పోలయ్య : వొంటి యెలాగుంటదో తెలుచా ? అచ్చంగా గాడిదలా వుంటద్ది. వొక్క సెవులే తక్కువ.

భీమన్న : సాల్లాన్లే ! నువ్వే వో పెద్ద గాడిదివి.

పోలయ్య : వొంటికి సెవులసలు వుండనేవుండవ్. ముకుతో యింటుంది.

భీమన్న : (సత్యంతో) జోస్తూ, యికడున్నా ! నీకోచం దుకాణాలన్నీ యెతికీ యెతికీ అతమారిపోయా. యిదిగో ! యీ చీచాతీచుకో. నా సేతులేం కాలీగా లేవ్.

సత్యం : ఆ రొయ్యల్ని బల్లమీదపెట్టు, దాంతో వో చెయ్యి ఖాళీ అవుతుంది.

భీమన్న : వో తప్పకుండా. పోలయా ? ఆడొంక సూడు. బలేసురుకైనోడు గదూ ?

పోలయ్య : దొంగలంతా సురుకైనోళ్లే. నాకు తెల్చు. సురుగ్గా లేకపోతే అళ్ళపనేం సాగుద్ది. మంచోడు – తెలివి తక్కువ దద్దమ్మైనా మంచోడే. కానీ చెడ్డోడు – సురుగ్గా వుడాలె. అయితే ఆ వొంటి సంగతేంజేసా ? నువ్వు సెప్పేదంతా తప్పులేదుక. వొంటి యెట్టిసాకిరీసేసే జంతువూ. కొమ్ములుండవ్, పల్లుండవ్.

భీమన్న : అరే ! జనమంతా యెక్కడ సచ్చార్రా ! వొక్కడూ కనిపించేడవడు! యేయ్, యెలికల్లారా ! బయటపడండ్రా !

నేను - నేను యిరూాల యిందుసేస్తుండా, యిందు ఆ మూాల యెవడసే -

సత్యం: జేబులో వున్న ఆఖరి కానీదాకా తాగెయ్యడానికెంత కాలం పట్టుండిరా, దిష్టిపిడతా!

భీమన్న: చనం! యీా తడవ మనం అట్టే కూడాబెట్టలా! అరేయ్ జోగాయ్! జోగాయెడీ?

గంగులు: (బల్ల దగ్గిరికి వెళ్ళి) సక్కా బోయిండు.

భీమన్న: అరే, కుక్కా, కుక్కా! యెంటూా మొరుగుడూా, యేంటూా గోనుగుడూా? తాగరా, గాఢ్ఢా తాగు. తలొంచుకుని అలా దిష్టి పిడతలా నుంచుండాయేం? యీా రాతిరి నే యిందు చేస్తుండా, యిందు. యిందంటే నాకెంత పాణమనుకున్నా. నాకే లచ్చల లచ్చలుంటేనా చారా దుకానం తెరుత్తా. అందరికీ బావర్సు! నిజం! దేముడి తోడు! చంగీతం, త్రైతక్కా... రాండి. అంతా రాండి. తినండి, తాగండి, చంగీతం యిని త్రైతక్కలాడండి. మనోయెద తీరుసుకోండి. దమ్మిడీ యియ్యక్కర్లా. యిదిగో చారా దుకానం! అందరిక్కీ బేవార్సు. యిక సత్తెం! నీకు... నా డబ్బులో చగం యిచ్చేత్తా. ఊఁ - తీసుకో... తీసుకో.

సత్యం: సగవేవిటి? యిస్తే అంతా యిచ్చెయ్. యీా క్షణం యిచ్చెయ్.

భీమన్న: అంతా! నాడబ్బంతానే! యీాచనంలోనే! యిదో వోరూాపాయి ... రెండూా... యెదో కాస్తచిరితిండనుకో.

సత్యం: సరే! నా దగ్గరైతే పదిలంగా వుంటుంది. దాంతో జూాదం వో ఆట ఆడ్తా.

పోలయ్య : పదిలంగా దాసడానికి నను సాత్రిగా యెట్టుగోండి. యెం తేం?

భీమన్న : నువా? నువు వొంటివి. నీ సాత్తెం మాకక్కర్లా.

ముత్తాయ్ : (కాళ్లీ శేమీ లేకుండా ప్రవేశించి) వోలబ్బో! నా కాల్లు తడిచిబోయినయ్.

భీమన్న : కాల్లెట్టాగో తడిచాయా, కూత్త గొంతు కూడా తడుపు కుందుగా న్రా. అదేగా నీ కాకావలచింది! నీ పాటా ఆటా బలే బాగుంటయ్ గాని నువు తాగడం – అదేం బాగుండలే! తాగుడు బాగ్గాదు – బాగ్గాదు.

ముత్తాయ్ : ఔనాను. మచ్చుకు నువున్నావుగా. నువు తాగి నపుడే మడిసివి ... యేయ్ గంగులూ? నా సిలక బుర్ర బాగు చేచా? (ఆడుదూ పాడుతూ)

"కల్లు ముంత తెచ్చినాను
కంచి లోన బెట్టి నాను
తాగమని సెప్పవే తడికో తడిక!"

సలి, బాబూ, సలి. బిగుచుకు పోతుండా.

పోలయ్య : యేయ్ – యెవతసే ఆ తడిక !

భీమన్న : ఆడి సావాణ్ణి సావనీ. నీ కెందుకంట, యిపుడు నువ్వు! పోలీచువీగావ్, మామువీగావ్.

ముత్తాయ్ : సుబ్బి మొగుడు – అంతే.

భీమన్న : నీ మేన గోడాలో తె జైల్లోవుండే, యింకో తె సత్తా నికి సిద్ధంగా వుండే ...

పోలయ్య : అబద్దం. అదేం సావుకు సిద్దంగాలేదు. మాయమై సక్కా బోయింది.

సత్యం : (నవ్వు)

భీమన్న : యెలాఅయితేనేం? కోడల్లు పోయింతర్వాత యింక నువ్వేం మామవి?

ముత్తాయ్ : ద్దొరా ! యింకేవ్వుందీ, యిక 'నూకలెడతా మేకల్నిగాయి.'

"ముక్కు పుడక దెచ్చి నాను
ముంతలోన బెట్టి నాను
తీచుకోమని సెప్పవే తడికో - తడిక !

(జోగాయ్ ప్రవేశం. చాలామంది యితర్లు వస్తారు. వారివారి సామాగ్రి తీసుకుని తిన్నెలమీద గొణుక్కుంటూ పడుకుంటారు.)

జోగాయ్ : అరే భీమన్నా.! పరుగుచ్చుకొచ్చినవేర్రా ?

భీమన్న : దా, దా కూకో. కూకుని వోపాట-ఆపాట నాకిట్ట మైన ఆపాట-పాడు, జోగాయ్ !

సాహెబ్ : రాత్రిల్లు నిదరాపోవాలా, పగల్ పాట పాడావాలా.

సత్యం : అంతే నవాబ్జాదా ! అంతే.

సాహెబ్ : హాంతే హంతే హాంటే హేన్టిగా! ఘోలాసేత్తార్ ... పాటల్ పాడితే ఘోలాపుట్టాదేం ?

భీమన్న : (సాహెబ్ దగ్గరకు వెళ్ళి) నీసెయ్యెలావుంది, నవాబ్జాడా! కోసిపారేసిండా ?

సాహెబ్ : హెందుక్కా ఖోసీపారాహేయడం ? హోగు ... ఖోసీ వేయకుంఢానే నయం హావుతాడి. హిదేం ఖొయ్యముక్కా ఖోసీహేస్తాన్కి ? హావసరంపడ్తే హిాట్టే ఖోసీహేయొచ్చు.

జోగాయ్ : నీపనికాలా ? సాయెబయా ! వొంటిసేత్తో యేం సేత్తా. సేతులుంటే నే పొట్టయెళ్తద్ది. సేయిలేకపోతే మడి సేలేదు. దా, దా వోగ్లాసు తాగేచి, ఆ గొడవంతా మర్సేబో.

సుబ్బి : (ప్రవేశించి) ఒహో ! ... యేంసలి! యేంసలి! యేం మంచు ! మా పోలీచాయన యిక్కడున్నాడా ?

పోలయ్య : యిదిగో...

సుబ్బి : మళ్లీ నారెయిక కొట్టుకొచ్చా. వోసుక్కూచుని నట్టున్నాయే ! యేం. యేంటియువాడం ?

పోలయ్య : యియ్యాల బీమన్న పుట్టిన్రోజు పండగా...సలి ! మంచు !

సుబ్బి : జాగర్త. మంచేం ! నీ కోతి సేట్టలేం నా దగ్గర సాగవ్ ...బబ్బుందాం పద.

పోలయ్య : (వంటింటోకి వెడుతూ) గుర్రెట్టి నిద్రపోతా. యేళై పోయింది. తయార్ - తయార్.

సత్యం : వీడ్ని గట్టిగా అదుపులో పెట్టటం లేదా యేం సుబ్బామ్ !

సుబ్బి : యిక అదొక్కటే గతిబాబు ! యిలాంటోళ్ళని గుప్పిట్లో యెట్టుకోవాలె. నాతో వుంటానికి యిణ్ణి రానిచినపుడు 'నేనేమొ దరిద్దురాల్ని, యీళ్ళే మో వొత్తి పోకిరీ మూక, యీ డేమో పోలీచు. అందుకని యీ డొల్ల కాత్త సాయం వుంటాది' అనుకున్నా. అయితేనేం

యెంటనే తాగుడు మొదలెట్టాడు. యీాడి జిమ్మడ! అలాంటిది నా దగ్గరేం సాగిసావదు.

సత్యం: యిలాంటి వెధవని చేరదీసావేం?

సుబ్బి: యింతకంటె మొరుగైనోడేడీ? లడ్డూలా వున్నావ్! యెందుకు వొట్టి దండగరఖం. నిన్నొచ్చి వుండమంటె వుండవాయె. వున్నా వోవారం. వారంతో బెడిచిపోతుద్ది. సిటికెలో నన్నూ, నా మంచినీ జూదంలో తగలేత్తావ్?

సత్యం: (నవ్వుతూ) నిజం! నిజం! నిన్ను జూదంలో వొడ్డేస్తా.

సుబ్బి: అరేయ్, ముత్తాయ్!

ముత్తాయ్: ఓ –

సుబ్బి: యేంరా నా మీాద తపుడు కూతలు కూత్తున్నావంట!

ముత్తాయ్: నేనేం అబద్దాలు, సుబద్దాలు సెపటం లేదే. మరి నేనే 'యిదిగో బలే ఆడ్డి. బలే పచందుగా వుంటద్ది. గుండులా వుంటద్ది. ఆ వొళ్ళు – ఆ కండలు. బత్తాబరు వుంటద్ది! అయితేనేం బుర్రలో తెలివి దమ్మిడీ యెత్తుండదు' అంతేగా నేసెప్పింది.

సుబ్బి: వోరి బడవా! నువు సెప్పేదంతా అబద్దం. నాబుర్రలో కాసెత్తు తెలివుంది ... అయితే ఆణ్ణి కొట్టాసని యెందుకు వాగా?

ముత్తాయ్: ఆ యాల – నీవు ఆణ్ణి జుట్టట్టుకు గుంజావే, ఆయాల దిట్టంగ ఆణ్ణి తన్నావనుకున్నా.

సుబ్బి : (నవ్వుతూ) వోరి దద్దమ్మా! నీకేం కల్లుతేవా? యేంటాముదిగ్గుడ్డలూ నవ్వా? ... పైగా ఆడిమడుచు నొప్పించావ్. నీ కూతలినే ఆడు తాగుడుకి దిగాడు.

ముత్తాయ్ : గుడ్డుగూడా తాగుద్దని పెద్దలెప్పేది నిజమేనన్న మాట!...

(సత్యం, గంగులు నవ్వుతారు)

సుబ్బి : అరె నీది నాలికా తాటిపట్టా? నీవేం మడిచివిరా ముత్తాయ్!

ముత్తాయ్ : పపంచంలోకల్లా గొప్పోణ్ణి! నాకద్దైనా పనిచ్చి సెయ్యుమని సెప్పిసూడు. నాయెనకాత్తే పడొచ్చిసూడు తెలుత్తాది!

సున్న : (సాహెబ్ పక్కచేరి) లే, లే, నిను నిద్దర పోనిత్తామను కున్నా, పాడేత్తాం. రాతిరిరాతిరంతా పాడేత్తాం. అరే జోగాయ్!

జోగాయ్ : పాడేద్దాం, పాడేద్దాం.

ముత్తాయ్ : వొంతపాట నేపాడ్తా.

సత్యం : యెలా పాడ్తావో సూస్తాంగా.

సాహెబ్ : (చిరునవ్వుతో) హారే సైతాన్ హెదీగలాసు తాగుదాం. తాగి పొద్దూపుచ్చుదాం. సచ్చిపోదాం.

సున్న : సత్తెం! గలాచునింపు. కూకో, జోగాయ్! యెంత గావాలేం? కడుపునిండా తాగేచి ధొరలా వుండా. జోగాయ్! యెదీ, ఆపాటయెత్తుకో ... పాడ్తా, పాడి యేడుత్తా.

జోగాయ్ : (పాట) "పన్నెండూ యెండ్లాయె

భీమన్న : (కలిసిపాట)

ఒడలి కాఆరమూ లేదు
కండ్లా, నిద్రైనా లేదు
నల్లూాలా బాదలచే
నలుగుతున్నాది దేహాము.
యెందుకైతే వుంచీ నావు
యీా బంది ఖానలో "

[హఠాత్తుగా తలుపు తెరుచుకుంటుంది]

రాజా : (గుమ్మంలోంచి బిగ్గరగా) యేయ్! రాండి - రాండి అదిగో - యాక్టర్ వురేసుకు చచ్చాడు.

[నిశ్శబ్దం. అంతా రాజాకేసి చూస్తారు. రాధ రాజా వెనకనించి కళ్లు పూర్తిగా విప్పుకుని బల్లకేసి వెడుతుంది]

సత్యం : (మెల్లిగా) ఛత్! పాటంతా తగలెట్టేసాడు, పిచ్చి పుల్లాయ్!

[తెర]

సాహిణీ ప్రెస్ విజయవాడ, ప్రథమ ముద్రణ 1952.